# రసికజనమనోరంజనము.

## ప్రథమాశ్వాసము.

చ. సిరివిరిబోడిఁగూడి యొకచేతను నాతుకచేతులూఁతగా
గరుడిని నెక్కిచోఁ గలికి కమ్మనికీల్జడ సంచుగాంచి యు
గ్గరుడియు నల్లత్రాఁచనుచు గ్రక్కున ముక్కున నొక్కనిక్కఁ దాఁ
జురచురఁ జూచి కేలుఁగవఁ జుల్కనదల్చెడు వెన్ను నెన్నదన్. 1

సీ. పక్కిగుజ్జుపురాతుఁ బక్కిగుజ్జుపురాతు
దాయయుఁగొడుకునై తళుకుగులుక
కొండకానుపుఁ బ్రోడ కొండకానుపుఁబ్రోడ
బావయునాలునై బలసి వెలుఁగ
కడలిపుట్టువయును గడలిపుట్టువయును
మేఁతయునగయునై మెఱపునెఱప
కందునితండ్రియుఁ గందునితండ్రియుఁ
దూపునుగన్నునై యేపుచూప
సత్రిజవరాలుకూళల మొత్తుకేలు
హత్తితోలును దోరంపుమిత్తిఁదోలు
క్రొత్తవాలును నల్లనికత్తుకయును
గలుగు గిత్తతత్తడిరాతుఁ గొలుతు నెపుడు. 2

చ. పలుకులచానవేనలిని బాఱఁగనుంగొని నల్లమబ్బుగాఁ
దలఁచి కలంగి పాఱఁ జను దానిని జెల్వపుటంచఁ గాంచి నే
ర్పలవడఁ జేయి దామరలనల్లన చేరఁగఁ బిల్చి దువ్వన
న్నలున యొసంగుఁగాత విడనాడక నాకుఁ గడింది కోరికల్. 3

క. కొబ్బెరకాయల మెక్కుచు
నిబ్బరముగఁ గొల్చువారి నెఱిఁ బ్రోచెడియా
గిబ్బవజీరుకొమారుఁడు
గొబ్బున నొడఁగూర్చుగాతఁ గోరికలెలమిన్. 4

చ. కలుములచేడె కోడలు నిగారపుఁ దెల్లనిమేనిచాన ప
లుకులసిరి కాటపట్టు బలుకోరికఁ బెన్మిటిమోముదమ్మిలం
దల రెడుకొమ్మ సోయగపు టంచపయిన్నడయాడుచామ యా
నలువవెలంది నిచ్చలును నాలుకఁ గాపురముండుఁ గావుతన్. 5

వ. అని వేల్పులనెల్లం గొనియాడి. 6

గీ. నన్నయఁ దలంచి తిక్కననెన్ని పిదప
నెఱ్ఱప్రగ్గడఁ గొనియాడి యెల్ల తెలుఁగు
కబ్బపుంగూర్పరుల మదిగారవించి
యొక్కటను బెద్దలకు నెల్ల మ్రొక్కులిడుదు. 7

గీ. నిందునెమ్మెను విడనాడి పుండులకును
నిక్కనీఁగలవగమాని నీరువిడిచి
పాలుగొనునంచ తెఱఁగూని వఱలుమీరు
తప్పులఁ దొఱంగి నెనరుంచి యొప్పుగొనుఁడు. 8

వ. ఇట్లు వేల్పులం దొల్లింటి తెనుంగు కబ్బంపుఁగూర్పరుల వేర్వేరఁ బేర్కొని నానేర్పుకొలంది నొక్కయబ్బురంపుఁ దెలుంగుకబ్బంబొనఁగూర్పం దలంచి మొదల నాకొలంబు తెలియించుక వక్కాణించెద. 9

సీ. జగములఁ గలిగింప నెగడింపఁ బొలియింపఁ
గల వెన్నుఁడే వేల్పు కన్నతండ్రి
యెలమి నెల్లరకును గలుములు కలిగించు
సిరిచెలియే వేల్పు చెలఁగుతల్లి

చెలరేఁగియందఱు వలపించి స్రుక్కించు
నసవిల్తుఁడే వేల్పు ననుఁగుఁదోడు
చదువులకెల్లను గుదురగుచు వెలుంగు
వెలిచానయే వేల్పు వెలఁదిమిన్న
యట్టినలువ వంగడమున నమరబుట్టె
రాజలింగమనంగను ధహిఁదనర్చి
యతఁడు బేసికన్నులవేల్పు నందుఁగలుగు
బత్తికలిమిని సరిలేకవన్నెమీఱె. 10

గీ. ఊళ్లఁబల్లెలు నేలుచు నుండియాతఁ
డెల్లవారలఁ దనుపుచు నీగిచేత
వాసిగనిగాంచెను గొలంబువన్నె కెక్కఁ
జంద్రమౌళియను కొమారు సాటిమీఱ. 11

క. అక్కమయను నెలనాగన్
మక్కువతోఁ బెండ్లియాడె మఱియాతఁడు మున్
ముక్కంటి గట్టుకన్నియ
నక్కఱతోఁ దాను బెండ్లియాడినకరణిన్ 12

క. వీరేశలింగమను కొడు
కారయఁగాఁ జంద్రమౌళి కరుదుగఁబుట్టెన్
జేరి మునుపాలకడలికి
గారాబపుఁజందురుండు కలిగినమాడ్కిన్. 13

ఉ. ఆతఁడువిద్దెలంగరము నందఱచేతను మెప్పుపొంది మే
ల్సేతల నెందునున్నవతులేక చెలంగి కరంబుమేటియై
ప్రాతిగ నేల ఱేండ్లకడఁ బ్రగ్గడయై కడుఁబేరుపొంది తా
నేతఱి మేటిదేవరని యెంచుచు లింగనిమానెఁ గొల్వఁగన్. 14

గీ. కొమరులనుగాంచె నాకందుకూరి కొలఁపుఁ
బెద్ద వేంకటరత్నమన్ పెద్దకొడుకు
వెనుకఁ జిన్నిసుబ్రహ్మణ్యమను కొమారు
నలరుతనచానయైన కామమ్మయందు. 15

కం. అందల సుబ్రహ్మణ్యుఁడు
పొందుగ నెల్లరును దన్నుఁ బొగడఁగసిరులం
జెంది వెలిఁగెఁ దనసరివా
రందఱిలో మిగుల నన్నయానఘుఁడై. 16

గీ. మున్నుకడలి రాకన్నియఁ జెన్నుమీఱ
వలచి వెన్నుండుగైకొన్న చెలువుదోఁపఁ
బున్నమయనంగఁ దవరారు పొలతిమిన్న
నబ్బురంబుగఁ బెండిలియాడెనతఁడు. 17

కం. అయ్యిరువురకును సంతస
మెయ్యనఁ జేకూఱ నేను నొదవితి మదిలో
నెయ్యమున న్నిలుపుడు మరు
నయ్యను వీరేశలింగమనఁ జనుచుందున్. 18

సీ. ఏమేటియడుగుఁ బొందామరల్ తొలివేల్పు
మొదలగువారలు పొందఁజాల,
రేవేలుపులవేల్పు నెదయందుఁ బాయక
కలుములకొమ్మ నిచ్చలునునుండు
నేదిట్టబొజ్జలో నెల్లజగంబులు
నొకమూలఁబొందుగా నొదిగియుండు
నేపెనుదంటపేళ్ళు దురపుటోరెంపుఁ
దపసిలోనగువారు తలఁతురెపుడు

నట్టివెన్నుండు కనికరముట్టిపడఁగ
నాదు డెందంపుఁ దమ్మిలోఁ బాదుకొలిపె
నాదుకబ్బంబుఁ దనకప్పనంబు సేయు
తలఁపు పెఱవేలుపుల సేరఁదఱియకుండ. 19

క. అట్టి కనికరపుగనికిన్
గట్టిగ వేలుపుల నెల్లఁ గాచుచుమదిలోఁ
బుట్టినకినుకన్ రక్కసి
జెట్టులఁదునుమాడు సిరుల చేడెమగనికిన్. 20

క. నెట్టనగొల్ల పడంతుల
బట్టలుదొంగిలిన చుట్టువాల్దాల్పునకున్
బొట్టెలఁ జంపఁగడంగిన
కట్టిఁడిముద్దియఁ దునిమిన కఱివేల్పునకున్. 21

క. క్రాలెడునాలున్ బంగరు
సాలున్నఱచుట్టువాలుఁ జాలఁగ నలుపౌ
డాలుం బాలకడలినడి
ప్రోలుకున్ సరిమాలు మేలుఁబొనఁగెడు దొరకున్. 22

క. మేటికిసిరియెద తామర
తేఁటికిగరువంపుఁ బొలసుదిండుల దళపుం
గాటపుఁ దెమ్మెర నెచ్చెలి
నీటికిఁ దెఱగంటి పక్కినెఱగూటికౌఁగిన్. 23

క. ఎన్నికగను కవ్వడియా
లన్నకుఁ దొల్వేల్పు పొగరుటావుల మెకపుం
గున్నకుఁ జెన్నగు జేజే
మిన్నకు బలుగొల్లకొలపుఁ బిన్నకు నెమ్మిన్. 24

తే. గీ. అప్పనంబుగ నానేర్చునట్లొనర్పఁ
బూను చిత్రాంగదయనంగఁ బొలుచునట్టి
యెలఁత పెండ్లితెఱఁగు జనమేజయుండు
వినెడు వేడుక మదిలోనఁ గొనలుసాగ. 25

వ. వైశంపాయనుం గనుంగొని. 26

తే. గీ. పెద్దయును మాకొలంబునఁ బేరువడిన
క్రీడియెట్లు చిత్రాంగద కేలువట్టె
వేడుకలుమీఱ నాలింతు వీనులలర
దాఁచకానతీవయ్య యోతబిసిరాయ. 27

క. అనజడదారియు ఱేనిం
గనుఁగొని సందియముతీఱ గారవమారన్
వినిపింపదొడఁగెఁ గవ్వడి
మునుముద్దియఁ బెండ్లియైన ముచ్చటయెల్లన్. 28

సీ. మగఱాల జిగితూల నగఁజాలు వగఁగ్రాలు
తెలిడాలుగలమేలుతిన్నెలమరఁ
బెనుగట్టులనురట్టు లనుబెట్టునునుగుట్టుఁ
గొనితిట్టఁ గనుపట్టు కోటలడర
నలరమ్ముచెలువమ్ము లలిఁగ్రమ్మువెలిగ్రుమ్ము
మురిపెమ్ము నెరనమ్ముముగుదలలర
నెనలేని గొనబూని పెనుకోనలనుదేనె
తెరలానుదొరలేని తేఁటులొలయ
నెచటఁగనుఁగొన్న నేనుంగులేపుచూప
నెల్లచోటులగుఱ్ఱంబు లెసక మెసఁగ
ముజ్జగంబులఁగలప్రోళ్ళ మురువునవ్వ
యలరుచుండు నింద్రప్రస్థమనెడువీడు. 29

తే.గీ. ప్రోలిహొంబట్టు టెక్కెంపుగాలియడరి
ప్రొద్దుతేజీలనవ్వలఁ బోవకుండ
నాపఁగాఁగాదె తనత్తేరికతఁడుకట్టెఁ
బాముగుంపులఁ జెలువంపుఁ బగ్గములుగ. 30

ఉ. చొక్కపుఁబైడిమేడలను సొంపగు పచ్చలచూరుపట్టెలం
జెక్కినకప్పుటాలపని చిత్తరుప్రాఁతల పారువంబులన్
దక్కినటంచుఁ బట్టుకొన దగ్గరప్రాఁకుల నుండుడేగచాల్
నిక్కుచు నంతదవ్వొగయ నేరక క్రమ్మఱివచ్చు నిచ్చలున్. 31

ఉ. ప్రోలికడాని మేడగమిఁ బొందుగఁ జెక్కినయట్టి పుల్గురా
టాలమెఱుంగు రంగులతెఱంగుఁ గనుంగొని త్రోవకడ్డుగాఁ
జాలెడుపచ్చికంచు నెదఁజందురుఁడెంచియె దానిమేయఁగాఁ
దాలిచెనిట్టిఁగానియెడఁ దాల్పఁగ నాతనికిట్టియేటికిన్. 32

చ. నెలయరుదెంచి యుప్పరిగ నిద్దపుసోరణగండ్లు సొచ్చినన్
వెలఁదులు లేచిచూచి కడువేడ్కమెయిం దమకేలుదమ్మిలం
దలుపులుమూయఁగట్టువడి తద్దయునేపట నేలనుండఁగాఁ
గలుగుటఁజుమ్ముపొల్చె నెలకట్టులనంగను నేలలెంతయున్. 33

సీ. తద్దయును వేలుపులజేని దాడిక్కోడి
గుంపులనుగూడి పఱతెంచి కోర్కులలరఁ
గడలిడాగవచ్చిన కొండగమియనంగఁ
గదిసితిరుగు నేనుఁగులగత్తియందు. 34

క. వీటనుగలగుఱ్ఱంబుల
గాటపువడికోడిగడ్డి కఱచెను లేడుల్
మాటికివడఁకుచు గాలియుఁ
బోటరితనముడిగి యొక్కమూలంబడియెన్. 35

క. ఎప్పుడుఁబూవుందోఁటల
నొప్పగుతావులకుఁ జిక్కి యొగిఁ జలిగాడ్పుల్
తప్పక కాపురముండఁగ
మెప్పొదవఁగఁ జలువలచట మేకొనియుండున్. 36

చ. వలపులుమీఱనీలములఁ బ్రాఁకుచుఁ దమ్ముల మొత్తపున్సిరుల్
తోలుతను వెచ్చపెట్టి పువుఁదోఁటను మోవులుతావులాని పె
క్కులు గలిగింతలందనరి కొమ్మలనిమ్ములఁ గూడివీటికిం
దెలదెలవాఱువేళఁ జనుదెంచును దెమ్మెరదంటయల్లనన్. 37

ఉ. వేలుపుమ్రాని క్రొవ్విరుల పెన్వలపుల్గొని విన్న వాఁకపైఁ
దేలుచు దానిచల్వయును దెమ్మెర తెచ్చియొసంగి చెమ్మటల్
దూలఁగఁజేయునిద్దురను దోఁగిమగల్ జవరాండ్రు వేసవన్
హాళినిమేలుకాంతురట నచ్చరబోఁటులు వీణెపాటలన్. 38

చ. అలమెలదోఁట మొత్తముల యందలిమ్రాఁకుల పూవుఁదేనియల్
వెలువడి చేలకాలువల వెంబడిఁబాఱుచు నూరిపైరులం
బలువిడిఁ బండఁజేయఁగని మబ్బులుసిబ్బితి డాగనిచ్చలుం
బొలుపగుతావితో నగళునున్బాగ లాడఁగఁజేయునెమ్ములన్. 39

చ. ఎనమటిలేక ప్రాఁజదువులెల్లను నేర్చుటెకాని లాఁతిచే
తను దలకొట్లనొందెనని తామరచూలిని దూఱి వేయునో
ళ్ళను దుదముట్టఁగాఁ జదువులంగనుటొక్కటె రెండు నాల్కలం
చొనరఁగఁబాపజేని నగియుండురు ప్రోలిని నేలవేలుపుల్. 40

సీ. చెవులెకన్నులుగాక దవునేలదాల్చురుల్
పలునాలుకలులేని పజదొరలొక
పగవానిఁగనిపాఱి బలుకొండకలుగున
డాగనిపసిఁడిపుట్టంపుదాల్పు

లోఁగిఁబగల్ సేయని జగముచుట్టంబులు
నడకఁదప్పనియట్టి పుడమిదాల్పు
లొక్కనిఁజేరని రొక్కంపుటొడయండ్లు
గ్రుక్కమైమఱవని చక్కనయ్య
లౌరయని యెల్లవారును నలరుచుండ
నలరుచుందురు తద్దయు బలిమికలిమి
నాడితప్పక సరిలేనిపాడిగలిగి
కొమరుపాయంపు నెఱరాచకొమరులచట. 41

చ. కలచెలి బిచ్చమెత్తుకొనఁగాఁగని యోరిచియున్నయూరునుం
గులికెడు దాయపాల్వఱిచి కొండలపాలయి మూలఁబడ్డ జ
క్కుల దొరదూఱి వీటఁగల కోమటులొప్పుదు రెల్లనెచ్చెలుల్
కలుములనొప్ప నిల్లుకదలంబనిలేక కడిందిపేరునన్. 42

చ. తెలతెలవోయి కట్టుకొనఁ దెల్లనిబట్టయెలేక మందఁగోఁ
పలఁ దగుత్రాగుఁబోతనుచుఁ బల్మఱువెన్నునియన్న నవ్వెమై
చెలువము జీరలున్ సిరులుఁ జెన్నెసఁగన్మరియూదకల్గియు
గ్గలమగు వేడ్కఁబొల్తురటఁ గాపుకొమారులు పాఁడిపంటలన్. 43

తే. గీ. మేలిమి పసిండి నిద్దంపు మేడకొనల
నలరుఁజోఁడులు నిచ్చలు నాటలాడఁ
జూడనడ్డని నెత్తమ్మిచూలి చెప్ప
పాటు పెట్టఁడయ్యెను వేల్పుకూటువులకు. 44

ఉ. క్రొన్నెలఱాలయుప్పరిగ కొప్పులనొప్పలు గుల్కుపాయపుం
గన్నెలముద్దుమోములను గ్రాలెడు మేడల దారినేగునా
వెన్నెలఱేని నేర్పుఱుప వేఱొకనేరుపు తోఁచమింగ దా
వెన్నెలఱేసలోనలుపు వేలుపుపెద్దయొనర్చె గుఱ్తుగన్. 45

సీ. ఏనుంగుతలలఁ బాలిండ్లసొంపుగఁజేసి
యానల్పు కొప్పులనలవరించి
చిందమ్ములనుగొంతు లందమ్ముగాఁజేసి
యాతెల్పు నవ్వులయందుఁబెట్టి
మల్లెమొగ్గలచాలు మఱిపల్వరుసచేసి
యామె త్తన ఁ పెదవులందిమిడ్చి
మట్టిపండులఁ జిన్నిమడిమలుకావించి
యారెఱు పడుగులయందమర్చి
నలువ యవ్వీటిబోటుల నలువుమీఱఁ
జేయఁబోలుఁగాకున్న నాసోయగంబు
వీసమంతైనఁగలుగదే వెతకిచూడ
ముజ్జగములందుఁగల పువ్వుబోండ్లయందు. 46

వ. మఱియు నవ్వీడు నేడ నీడులేని వేడుకలగూడిమాడి ప్రోడలయి తేనిఁగాన నేతెంచిన లాఁతివిలాతుల యొడయుండ్ల కడవన్నె బెడంగు బంగరు మగఱానగల తెగలు ఱాపిడిందగిలి నొగిలి నిగనిగ జిగ మిగుల దిగువంబోడియైకడుఁ బుడమింబడి యదరు కడిండియిసుక లెసకమెసఁగు తెరువులును నింతంతనరాని సంతసంబున బంతులుగట్టి రంతులుసేయుచు నెంతయువింతగాఁ బంతంబునఁ జేమంతిపూబంతుల పొంతకు గంతులిడు మేటితేఁటిదాఁటుల తేటపాటలనాటంబయి యుఱేఁగెలంకుల బింకంపు గొఱవంక తెగలుగల కొలంకులును నీలిడాలు చేలలంగ్రాలు మేలిజెండాలచాలు గాలింగదలంబొదలు తగులున మొగిలుతెగలని నిగిడి మిగుల పొగరున మగిడి నెట్టనఁ గట్టెఁడి పుట్టనట్టులం జుట్టుముట్టికిట్టి పట్టిబెట్టుగ నిట్టూర్పులెడలం గట్టిగఁగొట్టి పట్టరాని కట్టలుకంబొట్టలు పగులంగొట్టు బెట్టిదంపుఁ బని కట్టిపెట్టి నట్టువంబుసలుపుదిట్టనెమ్మిపిట్టల నొప్పియొప్పులుగుల్కు-

రాచిల్కపల్కులం జెలువుగులుకు సింగారంపుఁ దోఁటలును హెచ్చుగ నిచ్చలు మెచ్చులుగుల్కు నచ్చంపుఁ బచ్చలతిన్నెలఁ జెన్నగు వెన్న రాని తిన్నని పగడంపుఁ గంబంబు గుంపుల సొంపులునింపు పెంపగు కొలువుకూటంబులునుం గలిగి మావులుం దావులుంగలిగి మెల దోఁట సాటిని ముత్తెసరులు బంగారుతీగెలునుంగలిగి వరిచేలపోలిక సిరికాటపట్టయి పాల్కడలివడువునఁ దగవుకలిగియుం దగవులేక గోతులచే నొప్పియు గోతులులేకయొప్పి కొట్లుండియుఁ గొట్లులేక కరంబు దంబుమీఱు. 47

క. అవ్వీడు యుధిష్ఠిరుఁడను
పువ్విలుతునిఁ బోలుఱేఁడు పొందుగ నేలున్
జవ్వనము బలిమికలిమిని
దవ్వులదొరలెల్లఁ దన్నుఁ దద్దయుఁగొలువన్. 48

సీ. కడునొప్పుతనదు చాగపునీటియేటికిఁ
గడలికొండొక పిల్లకాల్వగాఁగ
గ్రాలుతనయసంపుఁ బాలవెల్లికి ముజ్జ
గంబులు దీవులశంబుసూపఁ
దనముమూర్తరకును దట్టంపుటశవిచా
లిఱుకైనచాలని యింప్లుగాఁగఁ
దనదునిండారైన తలవాకిలియెచూడ
నేతెంచుదొరలకు నిమ్ముగాఁగ
నొప్పుఁ గాఁపులకెల్లను నోముపంట
పాఱులకు సాదులకు గొప్పపట్టుకొమ్మ
బీదసాదలపాలిటి వేల్పుచెట్టు
జగములందెల్ల మేటి యజ్ఞమునికొడుకు. 49

గీ. అడుగువెట్టిన మారుతాం డడుగుపట్టు
మైమఱువిడినఁ బగతుండు మై మఱువిడుఁ
గొమరు దళుకొత్తు నారాచకొమరుఁబోలు
తేఁడుగలఁడె యెందును వలతేఁడుదక్క. 50

ఉ. వెండియుఁబైఁడియుం బుడమివేల్పుల కెన్నికమీఱఁదెచ్చి కై
కొండని తేఁడొసంగఁగని కుందుమది న్వలికొండవేలుపుం
గొండలుగట్టువిల్లుఁ గడుఁగొల్చిన నిల్లును విల్లుఁగాఁగొనెన్
మెండుగఁగొల్చిరే నతఁడు మేకొనియేలఁడె యెట్టివారలన్. 51

చ. జగమునఁబుట్టి పుట్టకయె సారెకనుంగొన నెజ్జవాఱుచుం
బగ లొనరించుచున్ బయలుప్రాఁకుచు నిల్కడ లేక యెప్పుడుం
దగఁజెరలాడుచుంబుడమిఁదద్దయు వేఁడిమిచూపి త్రాగనీ
రగపడకుండఁజేయు జమునయ్య యహా సరియౌనె తేజునన్. 52

చ. అతనియసంబు ముజ్జగములందును దానయి యెల్లవారలన్
జతనముమీఱ లిబ్బిదొరసంగడికాండ్రను వెన్నునన్నలం
గొతుకకచేయమాఱ్పడుటకుం గుఱుతుల్ తగనబ్బున న్మొలన్
సతమును వారుదాల్చిరి విసంబును వల్వయునన్నిపంబునన్. 53

క. కలిమియు నడఁకువ పెంపును
బలిమియు నోరిమియుఁగల్గి వఱలెడు దిట్టల్
నలుగురతనికిం దమ్ములు
గలరు వడముడియును గ్రీడి కవలు ననంగన్ 54

తే.గీ. అన్నయానతి జవదాఁట కనుఁగుఁదమ్ము
లనువుపఱుపఁ దమ్ములతలం పన్న నెఱపఁ
బాలునీరునుఁ గలసినబాతి వార
లొకరొకరిముద్దు చెల్లింపుచుందురందు. 55

సీ. చల్లఁదనంబును జెల్లీవిగల్గుట
జాబిల్లికొలమాట సాటుచుండఁ
జక్కఁదనంబును మిక్కిలి పరువంబు
వేఁగంటికొడుకౌట వెల్లడింప
నక్కటికంబును ననదలఁగాచుట
వెన్నుని చెలియౌట విన్నవింప
నసమునువడిగల్గి యలరుటమిన్నేటి
ముమ్మనుమండౌట పూని తెలుప
నన్నమాటయన్న నడుగుదాఁటక పిన్న
పెద్దయంతరువుల పెంపుదెలియు
మేటి క్రీడికెవరు సాటి ముజ్జగముల
నతనికతఁడె సాటియగునుగాక. 56

ఉ. ఆతనిసోయగంబు చెవులార వినంగనునట్టి ముద్దియల్
చేఁతలఁదొట్రుపాటెనయఁ జెల్వునినాతనిగాఁగ నెమ్మదిన్
భ్రాఁతిగనెంచి కూడుదురు బాపురె నిచ్చలుచూచిరేని యా
నాతుల చేఁతలంగలుగు నానలుకందుఁడు కొల్లవెట్టఁడే. 57

శా. ఆతండొక్కఁడు ప్రొద్దువోక యొకనాఁడందంపుఁ బూఁదోఁటలోఁ
జేతుల్ చేతులు సేర్చికొందఱుచెలుల్ సేమంబునన్వెంటరా
లాఁతుల్బారులుగట్టి చెంగలువ కేళాకూళి లోద్రోవలన్
వాతోడై చనుదేరఁ గ్రుమ్మరితగన్ జాబిల్లిజాతిన్నెపై. 58

సీ. కలయంగఁబన్నీరు చిలికినకురువేళ్ళ
వీవనయొక్కండు వీచుచుండఁ
బచ్చకప్రపుఁదావి మెచ్చుగుబులొక్కను
పండాకుమడుపు లొక్కండొసంగ

ముత్యాలకుచ్చులఁ బొదలుచిత్తరువ్రాఁత
కెంబట్టుగొడుగొక్కఁ డెమ్మెఁ బట్ట
జిలుగుజరీచెట్ల తలగడతొడక్రిందఁ
బదిలంబుగనొకండు కుదురుపఱుప
వలపుగొలిపెడు చిఱుగాడ్పు లొలయుచుండఁ
గెలనికొలఁకుల తేఁటులు వలుకుచుండఁ
జిలుకలతో ముచ్చటల్ సల్పు చెలిమితోడఁ
జెన్నమీఱంగఁ గూర్చుండి యున్నయెడను. 59

సీ. వేల్పురాయఁడు తనబిడ్డయొద్దికిఁ బంపు
పొలుపొందు పచ్చలబొమ్మలనఁగఁ
బ్రోలిచెక్కపుఁ జేలగాలిని నేలపై
గూలు జేజేచెట్లకొమ్మలనఁగఁ
బ్రొద్దుమావులు మేయఁబోఁజాటి పుడమిపైఁ
బడు పచ్చిగడ్డిజొంపంబులనఁగఁ
బువఁదోఁటగవ్వడిఁ బొడఁగాంచి మరుఁడంచుఁ
జేరుపూవిల్తు తేజీలనంగఁ
జిలుకలొకరెండు ముద్దులు చిలుకుచుండ
దిన్నెపైనున్న యెకిమీని కన్నుదోయి
విందుచెందంగ ముందఱ నందమొందు
పొన్నగున్నకు మిన్నునఁదిన్నడిగిరొ. 60

క. ఆకై వడిడిగి కొండొక
ప్రాఁకునఁ గూర్చుండిలేచి మగుడని మదితో
నాకవ్వడికన సొగసుల
ప్రోకలనం జిల్కలల్లఁ బుడమికి డిగుచున్. 61

చ. ఉడుగని వేడ్కతోడ మనమోహచెలి యింతకుముందుత్రోవలో
నెడనడుకొన్నదాని కితఁడేతగుఁ గన్గొని ముచ్చటాడి వే
వెఱలుట మంచిమేలుగదవేయని యందొకచిల్క సంతసం
బడరఁగఁబల్కెఁ గవ్వడికి నల్లవినంబడఁ దోడిచిల్కతోన్. 62

సీ. అట్లు నేలకుడిగ్గి యాతండుగన్గొన
మురువుఁజూపుచుఁ గొంతపొంతమెలఁగి
ప్రేమాలసంపఁగచెట్టు వాలుగొమ్మనుప్రాలి
చూడ్కికింపును సొంపుఁజూపుచుండ
నంతవివ్వచ్చుండు చెంతఁజిల్కలఁగాంచి
రాచిల్కలార మీరలనుకొన్న
దెయ్యదిత్రోవలో నెవ్వనితో ముచ్చ
టింపఁగావలెనిందు నెందులకును
మీర లేపని కరుగుచున్నారలిపుడు
పయన మొకయింత గుదియించి పలుకనైన
నదియుమాకుఁ జెప్పఁగవచ్చు నదియెయైన
నించుకంతనిలిచి వినిపింపవలయు. 63

క. ఇందఱముందఱ నిందది
పొందుగఁ జెప్పంగమీకుఁ బోలనిదైనన్
సందడిడిందఁగ నాతని
నెందైనఁ గొనిచని ముచ్చటింపఁగఁ జెల్లున్. 64

క. మీయందము చందము కం
దోయికి విందు గొలుపుచును దొందరనొందం
జేయుచునున్నది మీపొం
దేయెడ నెడఁ బాయజూతురే యెవరైనన్. 65

గీ. తడయ మీకనియేమైనఁ జెడునొయనుచు
నిపుడు మిమ్మింతగా వేగిరింపవలసెఁ
గాని మీచెల్వ కన్నారఁగాంచుచున్న
నెంతసేపైనఁ జూడనే యిచ్చవొడము. 66

చ. అనవిని చిల్కపల్కు నిటకారయ మేమురుదెంచుటెవ్వరిం
గనుఁగొని మాటలాడనయ ! గట్టిగ దేవరవారితోడనే
మనవియొనర్ప వచ్చితిమిమీమదిఁగల్గినదెల్లఁ బైనముం
జనుటయె కర్జమైనఁ జనఁజాలము నీకొలువింతసేయఁగన్. 67

క. ననుమీరడిగిన దంతయు
వినుఁడిఁక వినుపింతుమీకు వేడుకమీఱం
గను మంజువాణియందురు
నను నా చెలియె మృదువాణినాఁబడు నిదియుం. 68

సీ. చిత్రవాహనుఁడనఁ జెలఁగుచుండెడు ఱేని
వినియుందురాతని వీటినుండి
పలుకుచేడియఁజూడఁ దొలి వేల్పు జగమున
కేగుచునున్నార మెలమితోడ
ఱెక్కలునిమురుచు మక్కువవెలిచాన
చక్కెరతినిపించు చక్కఁజేర్చి
తనబిడ్డలుగనెత్తి తడవుగనిన తల్లి
వలెఁ బెంచుచుఁదనంతవారిఁగాఁగ
నొద్దఁగూర్చుండఁబెట్టుక ముద్దుచేతఁ
జనువుమీఱంగ నామెయె చదువుచెప్పి
చక్కఁ దిద్దుకొనియెఁగానఁ జదువులెల్ల
నొనర నఱచేతిలోనివై యుండుమాకు. 69

గీ. అదియటుండనిండఁక వేగనరిగి యచటఁ
బల్కుపూబోఁడిఁబొడగాంచి పల్కులాడి
మరలిరావలెఁగావున మాకునిపుడ
సెలవొసంగుము పోయివచ్చెదమటన్న. 70

వ. ఆవలంతి చిలుక మేలుబంతుల కాతండిట్లనియె. 71

గీ. తొలుతనేలకుడిగ్గుచుఁ ద్రోవలోన
దవ్వులను మనమనుకొన్న దానికితఁడె
తగును జెలియరో యంటివి దారిలోన
నేమిచెప్పుకొంటిరి దేని కేనతగుదు. 72

గీ. అయ్యదిటువంటిదనిచెప్ప ననువుపడినఁ
గొఱఁతవెట్టక యానతీఁగూడుననిన
నలువలంకులఁ దిలకించి చిలుకకలికి
కలికిపలుకుల వలపులు చిలుకఁబలికె. 73

గీ. మంతనంబున మాటాడు మాటయదియుఁ
బలుకవచ్చునె యానుగా మంచితఱియు
నెవరుపెఱవారు లేరుగా యిందులోన
నన్నమనవారలెగద యీయున్నవారు. 74

వ. అనిన నతండు. 75

గీ. కలికిచూపునఁ గొలువెల్ల గలయఁజూడ
నేకతముగోరు నన్నగా నెల్లరెఱిఁగి
చూపుతోడన వడిలేచి చుట్టునున్న
తోడివారలు దవ్వులఁ దొలఁగిచనిరి. 76

వ. అంత మఱింత చెంతకుంజరగి తేనిమొగంబునన చూపునిలిపి ముద్దులు
గులుకు కలికిపలుకులు వినులకు విందుగొలుప నాచిలుక యల్లన నిట్లు
చెప్పందొడంగె.

మ. తొలుతం జెప్పితిఁ జిత్రవాహనుని నీతో నేనిటన్ వానికిన్
గలదో ఱేఁడ కొమార్తె యొక్కరితె యాత్రాల్గంటి నీ నేలలో
పలఁ జిత్రాంగదయంద్రు దానిచెలువాపల్కుంబువుబోఁడియుం
బలుకంజాలదనంగ నేటికిచటన్ మాబోంట్లవాత్రువ్వఁగన్. 78

గీ. కలువకంటి సింగారంపు గడలియందుఁ
గ్రాలుతాబేళ్ళుఁ జందంబుమీలు మొసలి
కవయు ననఁగ నొప్పారిమీఁగాళ్ళు గొంతుఁ
గన్నుఁగవయును బిక్కలుఁ గరమువెలయు. 79

గీ. వెలఁది కమ్మవిల్తు విరివిల్లు కాఁబోలుఁ
గాకయున్న నేలగలుగునడుము
ముత్తెములను పేర ముద్దులుగుల్కెడు
వ్రేళ్ళసందియానవాళ్ళు మూడు. 80

చ. నిలుకడగన్న క్రొమ్మెఱుఁగు నిక్కపు జేఁతలు పూసియెల్లెడన్
మెలఁగుకడానిబొమ్మ నును మేనున గమ్మనితావులీను పు
వ్విలుతుని పూవుముల్కి తెలివిప్పుచొకాటపుఁ గన్నదోయికిన్
బెళుకిడు ఱెప్పపాటుగల వేలుపు ముద్దులగుమ్మ యారయన్. 81

సీ. వెండికొండదొరయా వెలఁదుక చనుదోయి
వలమురిమేటి యాకలికిగొంతు
రాయంచపయిదిట్ట యాయింతినెన్నడ
తమ్ములచుట్టంబు కొమ్మకేలు
వలపులఱేఁడు లానెలఁతుక పెన్నెరుల్
చందురుమామ యీచానమోము
పాములమెకిమీఁడు పడఁతుకనూగారు
తెఱగంటిదంట లాతెఱవకన్ను

లిటులు వేల్పుల దొంతియై యొసఁగుచున్న
కొమరుఁ బాయంపు ముద్దియఁ గూడఁ గల్గు
మేలు సమకూడెనేని యోకేల తేఁడ
కోరు కోరికలెల్లఁ జేకూఱుటరుదె. 32

గీ. తలిరులింతి యొడలి మెత్తఁదనముకోడి
యొడలు లేనట్టివానికే యూఁచలయ్యెఁ
దొడరి యేనుంగు లెలనాగ నడకకోడి
నడకతప్పిన కొండలకడను జేరె. 33

సీ. వాలుమించును మించువాలును వదలించు
మెలఁతుకకన్దోయి మెఱుఁగుటారు
వింటిబెళ్కును బెళ్కువింటిని వదలించు
నాతుకకన్బొమల్ నడుముతీరు
తమ్మికెంపును గెంపుఁదమ్మిని వదలించుఁ
బడఁతుకవాతెఱ యడుగుదోయి
మెఱుఁగుబంతిని బంతిమెఱుఁగును వదలించుఁ
గన్నియచెమ్మనుఁ జన్నుదోయి
వెలఁది సోయంగ బేమని విన్నవింతు
నచ్చరలయందు జక్కులమెచ్చెకంటు
లందుఁ జిలువరాకన్నియలందు నెందు
గనియు వినియు నెఱుంగ నీకలికికీడు. 34

ఉ. చందురుమామ తమ్ములును జాము మొగంబును బోల ముందుగాఁ
గందును మోడ్పుఁ బాపుకొన గాల్కొని తామరసాటి వచ్చె నె
మ్మెం దగవేఁడి వేల్పు నెఱమెప్పుల నిల్కడలేకయుండు నా
చందురుఁడీసువచ్చుటకుఁ జాలక మారుతుఁడయ్యె దాసికిన్. 35

క. ఎలనాగ వాలుగన్నులు
కలువలనుచుఁ జేరు తేఁటిగములనదల్పన్
దెలిచాన నడుమనుంచిన
యాలరెడు సంపంగిమొగ్గయన ముక్కమరున్. 86

శా. నేలంగల్గు పులుంగులెల్ల నెపుడున్ జెల్వారఁబల్కంగ నే
నేలా పల్కఁగ నేరనై తినని దెంతేఁగెంపుకన్నుల్గుతా
లోలోనందలపోసి నేర్చి నవలాలోఁజేరి కాదంటిరే
నేలా కోయిలపల్కులంద్రు వినువారెల్లం బువ్వుంబోఁడికిన్ 87

చ. కలువలు లేళ్ళు వాలుగలుఁ గాటుకపిట్టలుఁ దేఁటిచాలుఁ దూ
పులుఁ దెలిదమ్మి తేకులును ముత్తెపుఁజిప్పలు మంచుగ్రోలు పు
ల్గులునననొప్పు తొమ్మిదియు గుబ్బెతకన్నులకోడెనంచుఁ గ్రే
వలఁజెలువారఁదొమ్మిదుల వ్రాసిరనంగను వీనులొప్పగున్. 88

గీ. అతివచనుపూవుగుత్తుల యుండఁజేరఁ
జానకెమ్మోవి దొండపండానఁ దుమ్మె
దలును జిల్కలుఁగా నల్లదడవునిలిచి
యారును బలుకులును నయ్యె నతీవ కెలమి. 89

ఉ. తుమ్మెదదిమ్ముసంపెగయుఁ దొరపుఁజీకటి చందమామయున్
దమ్ములు రిక్కచాలు మదిఁదాలిచి నెయ్యముఁ దొంటికంటుఁదా
మిమ్ములఁబాసి కూడెవన నింపగుఁ జూపులు ముక్కుటెక్కునున్
గ్రొమ్ముడిమోముగోము జిగిగుల్కెడు కేల్గవ యింతిగోరులున్ 90

గీ. చానసిద్దంపు జిగిమేని చక్కఁదనము
వెలసితద్దయుఁ దెఱగంటి చెలువెదూఱు
కన్నియతళుకుఁ దెలివాలుఁ గన్నుదోయి
చెలఁగి మిక్కిలి తెఱగంటి చెలువెదూఱు. 91

మ. కనుచేఁపల్ బిగిగుబ్బజక్కవల వీఁకంజూచి లోజంకి వే
డ్కను జేరంజని మోముచందురుని యండంజేరనూగారు పా
మనికింబొక్కి పుట్టవేవెడలి డాయంగాంచి వేఁడంగ వ
చ్చిన జాబిల్లియనుంగుకొమ్మలన మించెన్ ముత్తియంపున్నరుల్. 92

గీ. మల్లెమొగ్గలజిగిఁబోలుఁ బలుమెఱుంగు
బలుమెఱుంగునుబోలుఁ గమ్మమెయితేట
బోలి మెయిఁదేఁటులనుఁబోలు వాలునెఱులు
వాలునెఱులనుబోలు నప్పడఁతియూరు. 93

చ. మెలఁతుక చన్నుఁగొండలకు మీఁదను జందపుదిట్టనెంతయున్
జెలువుగఁగొల్చి గొంతువెసఁజందపు దిట్టతనంబుపూనఁగాఁ
బొలుపుగఁ జుట్టువాలుదొరఁ బొందెఁ బిఱుందులు సైపలేక నే
ర్పులవడవెన్నుఁజేరె నలపైదలికీల్జడ వింతదోఁపఁగన్. 94

చ. మఱుఁడనువేఁటకాఁడతివబల్ చనుగొండలయండ ముత్యపు
న్సరులను బియ్యమూసలఁ బెనంగఁగ మచ్చిడి యందగాండ్ర య
బ్బురమగు డెందపు బులుగు మొత్తఁముబట్టుచు నీరుద్రావడ
గ్గరఁజనుబొడ్డుడిగ్గియకుఁ గట్టినబంగరునుట్టు లత్తఱుల్. 95

గీ. జవ్వనపుదటిఁ గన్నియచన్నుదోయి
కౌనుకలిమిదోఁచుకొనియెఁ గాకయున్న
సింతలోగుబ్బలకుఁ గల్మియెట్టులబ్బె
నేమికతమున నడుముకు లేమికలిగె. 96

గీ. జవ్వనపుఁదటిఁ గన్నియచన్నుదోయి
కౌనుకలిమిదోఁచుకొనియెఁ గాకయున్న
నింతలోగుబ్బలకుఁ గల్మియెట్టులబ్బె
నేమికతమున నడుమును లేమిగలిగె. 97

గీ. చెలఁగి పలుచాలుఁగేలు మైఱుఁగులఁబోలు
నాసదానిమ్మయు నిగ్గుల నలరు మొదలు
నడుముఁ దుదిలేసి వేలుపుఁ గడఁగికొలిచి
తామునల్లె చనులఁ గొప్పఁ దఱులఁ బోలె. 98

ఉ. పోలఁగవెన్నుచూపె వరిపొట్టలు నేనుఁగుకేలుమోడ్చెఁ దా
మేలును బొట్టలోన దలపెట్టుకొనెం దలవంచెనంటులున్
దూలుచు తేళ్ళుగడ్డితినెఁ దొయ్యలి పిక్కలఁ జన్నుదోయి మీఁ
గాళుల నిద్దపుందొడలఁ గన్నులఁబోలఁగ జాలమింజుమీ. 99

క. నెలయా మొగంబుజిగి వె
న్నెలయా తెలినవ్వుజవ్వ నెఱబంగరు గి
న్నెలయా చన్నుంగవతి
న్నెలయారె పిఱుందుదోయి నెలఁతకుఁదలఁపన్ 100

గీ. కాలియందెలన్ పాదులఁగలయఁ బెరుగు
నరఁటికంబంబు లెన్నంగ నతివతొడలు
దానియాకువీపు చలువదలఁ దిపాదు
కదిసినట్టి తాబేళ్ళు మీఁగాళ్ళుతలఁప. 101

గీ. చెలువ నెమ్మోము చందురుగెలువఁజూచి
యుడుగుఁదమ్ములిదియె మంచియదనటంచు
నతని కొమ్మల నీడ్చితెచ్చి తమలెంక
లుగ నొనర్చికొనెనన గోళ్ళొప్పుగిఁ జెలంగు. 102

చ. చిలుకలకొల్కి నెన్నడుము సింగపుఁ జెల్వముఁ జూపుఁ జూపు రూ
పులపసమించు మించులకుఁ బోఁడిమి మై జిగినించు నించుమి
క్కిలినగుఁబల్కు పల్కుదురు కెంపులసొంపులు మాపు మాపు వె
న్నెలఁగని నవ్వునవ్వుఁ జిగినిదమెఱుంగు మెఱుంగుఁ జెక్కుళుల్. 103

గీ. మీల నేలఁ జాలు వాలుఁగన్నుల డాలు
మిన్ను చెన్నుఁ దన్నుఁ గన్నికొను
మించుమించుమించు నంచయాన యొడలు
పొఁగరుక్రొఁగరుచిగురు ముగుదకేలు. 104

సీ. వెన్నెలగువ్వల వెలయించుఁ జెలినవ్వుఁ
జన్నులు నిడువాలుఁ గన్నుదోయి
పుట్టతావుల మీఱుఁ బోఁతుక పొక్కిలి
మేను నునుజెలువారు మెఱుఁగుటారు
పసిఁడితివ్వల నేలుఁ బడఁతుక మైజిగి
పిఱుఁదులు సిబ్బెంపు బిగువుఁ జనులు
కెంపుఁ దమ్ములసిరి గెల్చుఁ గన్నియ మోవి
కన్నులు నునుపారు కలికియడుగు
తారయా ముద్దరాలి రూపమరఁగన్న
నడవిలోఁ గాయగసరుల నారగించి
చెట్టునీడలఁ బవళించునట్టి తపసు
లైనఁ జేరికొల్వరె యింతియడుగుదోయి. 105

చ. చెలువము మావిగున్న యలచెల్వపుఁ గొమ్మలె చేతు లందపుం
దలిరులె కేలుదోయి నెఱతావులపూవులె గోళ్ళు తేనియల్
దొలఁకెడుపండ్లె గుబ్బగవ లోఁతగుతొఱ్ఱయె బొడ్డు పండ్లకై
చెలువుగఁ దొఱ్ఱ వెల్వడిన చీమలబారులె యారు కన్గొనన్. 106

ఉ. తమ్ములు కన్నుదోయి బలితమ్ములు మేలిపిఱుందు లెంతొ గు
త్తమ్ములు గుబ్బ లేనుఁగులతమ్ములు నెన్నడ లెన్న మించు మొ
త్తమ్ములు మేను కెంపుసయితమ్ములు చేతులు కమ్మవిల్తు చే
తమ్ములు చూపు వీనులకితమ్ములు పల్కులు ముద్దుగుమ్మకున్. 107

ఉ. అనగుమోము చక్కఁదనమూతళుకుంజిగి చెక్కుఁదోయి యొ
ప్పా నిరుపేదకౌను సొగసావెలితళ్కుఁ పిసాళిచూపుడం
బౌనిడువాలుగన్బెళుకు లాజిగినిద్దపు మేనిసోయగం
బౌనునుసోగపెన్నెరుల యందమయారె యోయారికే తగుఁగా. 108

క. అమ్మచ్చెకంటి చక్కఁద
నమ్మంతయుఁ జెప్పఁదరమె నాతిపిఱుఁదు నం
దమ్మెన్నఁగ నొకనాఁడౌ
నెమ్మొగమెన్నంగ నొక్కఁ నెలయాఁ జుమ్మీ. 109

గీ. అనుచు వెండియు నేమిమో యనఁగడంగు
చిలుక నరచేత నేమాన్చి చెలువుమీఱఁ
బలికె నాతండు తాళుమో చిలుకరాయ
వలదు నీమాటకడ్డంబు వత్తునిపుడు. 110

గీ. నన్ను సైరించి నేనిపుడెన్నఁ బోవు
పలుకువిని దానికిని మాఱు పలుకవలయు
నింతదోఁపంగ నాత్రోడ నింతదనుక
తేటగా నీవు పలికినమాటలందు. 111

క. "వెలిచాన నడుమ నుంచిన
యలరెడు సంపంగిమొగ్గ" యని చెప్పితివా
చెలువను నామెయొనర్చెనో
కలుగునో వేఱొండు తెఱఁగు కలయది చెపుమా. 112

గీ. అనినఁ జిలుక పలుకు నా చెలిచానయొ
చేసె నానెలంతఁ జెప్ప కింత
వఱకు నుక్కుసైపవలయును బయనంపుఁ
దొందర మును చెప్పఁదోఁచదయ్యె. 113

సీ. నలువరాణియుఁ దానుగొలువుండియొక్కనాఁ
డచ్చరల్ చనుదెంచియాడిచనిన
పిమ్మటఁ గొంతసేపమ్ముద్దుగుమ్మల
చక్కఁదనంబులు చాలఁబొగడి
మాటవెంబడి వారిసాటివారలఁజేయఁ
దనకెగా కొరులకుఁదరముగామి
మాటికిఁజెప్పిన మగఁడుఁ దానునుజేయ
రాదు వచ్చునెడువాదుసల్పి
వారిమీఱువారి నిచేయవచ్చునెడు
మాటపట్టింపుఁబట్టి యమ్మచ్చెకంటి
యీచెలినొనర్చి పంతునెగ్గించుకొనియె
నలువగరువంబుదిగజాఱెనాఁటినుండి. 114

క. ఈయతివఁబోల నలువకుఁ
జేయంగాఁదగిన నేర్పు చేకఱమినిజం
బోయేలిక చేకుఱనే
నాయన యెందైనఁ జేయఁడామున్నెపుడున్. 115

సీ. దారినేతెంచుచుఁ దడవొండొరులతోడ
వెలఁదిచక్కఁదనంబె వేయినోళ్ళఁ
బొగడిమెచ్చుచు నామెసొగసున కెవ్వండొ
తగుమగండనియింతతడవుమేము
పరికించుచున్కి నిప్పట్టున మిముఁగాంచి
మీచెల్వొకనులారఁ జూచిచాల
మదినచ్చెరువుఁబూని మహిలోననేఁడుగా
కలికికీడగువానిఁ గంటిమనుచు

సంతసము పట్టఁజాలక సరగడిగుచు
నంటిమీాతండ తగునని వింటివిగద
గడియయును మాకునిచ్చుటఁ దడయఁదీఱ
దేగివత్తుము మఱచిపోయెదవుసుమ్ము. 116

క. అనివీడ్కొని రాచిల్కలు
వినుత్రోవను మీాఁదికెగసి వెసఁజూపునకున్
గనఁబడక సాగిపోయెను
గనుచుండెడి తేనిచూడ్కి కళవళపడఁగన్. 117

వ. అనిన తరువాతికథ చెప్పుమని జనమేజయుం డడుగుటయు. 118

సుగంధి వృత్తము.

పొన్నగున్న నెక్కి గొల్లపువ్వుబోండ్లతోడుతన్
వన్నెమీాఱఁ జేతులెత్తి పల్కెరొక్క చెల్వనన్
జెన్నుమీాఱ మ్రొక్కకున్నఁ జేలలియ్యనందు నాఁ
డన్నపంతు గెల్చుకొన్న యట్టిదిట్టవేలుపా. 119

కందము. గోమూత్రికా బంధము.

దరివిసమిడఁ జనుకొమ్మం
బొరిగొని తెలివొందు పైఁడిపుట్టమురాయా
పొరిఁగసవొడలను గ్రమ్మం
దెరిపిని జెలినందుఁగూడి దిట్టగురాగా. 120

గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందుకూరివంశపయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్య పుత్ర సుజనవిధేయ వీరేశలింగ నామధేయప్రణీతంబయిన రసికజనమనోరంజనంబను ప్రబంధరత్నంబునఁ బ్రథమాశ్వాసము.

# రసికజనమనోరంజనము.

## ద్వితీయాశ్వాసము.

క. సిరి యెడవాయక యొమ్మున
నిరవుకొనం గొలుచువారి నెల్లర నెమ్మిం
దిరముగ నేలుచు గడలిన్
బరగన్నులకొన్న వేల్పు వలమురిదాల్పు. 1

వ. అంత వైశంపాయనుం డటమీఁద నడచినకత జనమేజయున కిట్లని
చెప్పందొడంగె. 2

చ. వలపులమేలుకొల్పు తెరువర్లతలంపని కీడు చల్లగా
డ్పులకును మక్కువట్టు మరుపూన్కికి వేడనితోడుపాటు రా
చిలుకలమేలు జాజికిని జెప్పఁగరాని విసంబు గండుఁగో
యిలలకు నోముపంట చెలువేమని నామనివచ్చె మెచ్చుగన్. 3

గీ. వీఁకవచ్చునామనిజేని రాకకలరి
తొంటిపసపుఁజీరలువిప్పి తోఁపుచీర
లెలమిఁదీఁగె చెల్వలుదాల్చి మొసఁకమెసఁగు
పగిదిఁ బండుటాకులురాలి చిరుగులొదవె. 4

సీ. చెట్లకన్నిటికిని జెడిమున్నె పోయిన
సరిలేనితావులు మరలఁగలిగె
జాజికొమ్మకు మున్ను జరగని మరుతూపు
లరసిన నొకటియునంటకుండెఁ
గోయిలగమికెల్ల గ్రుడ్డప్పటియునుండి
గల కాకిమూఁకల చెలిమివదలెఁ

బెనుమావికొమ్మకుఁ బెద్దతడవులేని
కోయిలపల్కుల కొమరుగలిగె
సింతకెన్నఁడు నిలుకడ నెఱుఁగనట్టి
గాలికిమ్మెయి నెమ్మది చాలఁగలిగెఁ
జెప్పనొప్పును యామనియొప్పిదంబు
చిలువయెకిమీసకైనను నలువకైన. 5

సీ. పొంకమగుచుఁజను పూవుగుత్తులనొప్పి
కోయిలపల్కుల కొమరుమిగిలి
ముద్దులుగుల్కెడు మొగలిరేకులమించి
చెలువంపుఁబాపటఁ జెన్నుమీఱి
వింతవింతలతీఁగె దొంతులసొగసూని
పలుమల్లెమొగ్గల చెలువుదాల్చి
బొట్టుగలకడింది పొలుపున నలరారి
మోవిచిగురుల బల్‌రీవిఁ బడసి
యామునేనుఁగు నడకల నల్లదనరి
కన్నులకుఁ బండువొనరించెఁగాన లచ్చి
యెల్లవారికి సంతస మెదలలోన
వెల్లిగొలిపి యయ్యామని నెల్లతఱిని. 6

గీ. పురుడులేకుండ నక్కానపువ్వుబోఁడి
యలరు కొమరుఁగనిన పల్కులాలకించి
యీడులేకుండ నత్తఱినెల్లపులుఁగు
గములుఁబిల్లఁ బెట్టంగఁగడఁగెఁ గడఁక. 7

చ. కొలఁకులనాడుచుం బొగడగున్నల డాఁగురుమూఁతలాడుచుం
దొలఁగక చల్లులాడి పువుదుమ్మెగఁ జిమ్ముచుఁ దీవెతూఁగుటు

య్యెలలనునూఁగి పువ్వుపొదరిండ్లను దూఱికదల్చి తోఁటలో
నలరులు రాల్చుచుందిరిగ నామనిఁదెమ్మెర పిన్నవెయ్యెడన్. 8

చ. వలిపువునీటికాలువల పజ్జలకుంజని యూలలాడి మే
ల్చలువలఁదాల్చి గాడ్పు నెఱజాణఁడు మెల్లనఁబూవుఁదోఁటలో
నలరుల కొమ్మఁజేరి చిగురాకు మునుంగుఁ దొలంగఁజేసి య
వ్వల విరిగుబ్బగుత్తులను వ్రాలుచుఁ బైకొని తావులంటెడున్. 9

చ. అలరులతేనెవానగను హాయిగ మ్రోయుచు నేగుతేఁటిచా
ళులుఱుముల జెలంగు మొయిలుంగమిగాఁగఁ జెలంగికూయు కో
యిల రొదనెమ్మికూఁతగను నెల్లెడగొజ్జఁగి పూవునీరువం
కలగమిగాఁగనొప్పి ననకారుచెలంగెను వానకారనన్. 10

సీ. వాతెఱమఱుఁగైన పలుచాలుచాడ్పునఁ
జిగురాకులో లేఁతమొగడలమర
గబ్బిగుబ్బలనొప్పు కప్పుఱానరులునాఁ
బూలగుత్తులఁ దేఁటిచాలుదనరఁ
గైదోయినలఁదిన గంధంపుఁబూఁతనాఁ
గొమ్మలఁబుప్పొడి కొమరుమీఱఁ
జెమ్మటపోవీఁచు చిఱువీవెనయునంగఁ
బండాఱుగాలిచేఁ బ్రక్కఁగదలఁ
బొదలు వేడుక ముద్దులు మూటగట్టఁ
జాలుసింగారములు వెదచల్లుచున్న
పూవుఁదోఁటను గైసేసి తావి తియ్య
కన్నెమామిడి యొక్కటి చెన్నుమీఱె. 11

చ. చిగురుఁగటారినూఱి వెడసింగిణి కేలనమర్చి సూరెలం
దగిగొఱపంక పౌఁజుగడు దాడిగరావడి నారిదీటుచుం

బాగరునఁ జిల్కతేజిమళుపుల్ దుమికింపుచుఁ దేఁటులార్వఁగా
జగములమీఁదికిన్వెడలెఁ జక్కెరవిల్తుఁడు మచ్చరంబునన్. 12

వ. అట్టియామనియందు. 13

ఉ. పన్నుగనన్ను మిన్న చెలువమ్మటు వీనులవిందుగాఁగ ము
న్నన్నదివిన్నవించి చిలుకల్దగమిన్నునఁ జన్నునుండియున్
గన్నియయాపు కన్నుఁగవఁ గట్టినయట్టుగ బిట్టుతోఁపఁగాఁ
గన్నులవింటిదంట తనకై వడి చూపెను గ్రీడపై వడిన్. 14

సీ. కనఁడెట్టయెదుర నిల్చినవారలనునైనఁ
గనియెనేనియు నఱగంటఁజూచుఁ
జెవిఁజొనుపఁ డొరులుచెప్పెడుమాటలఁ
జొనిపెనేనియు నేమిటనుచునడుగుఁ
బలుకరించఁడు తనచెలికాండ్రనైనను
బలుకరించిన వెడపలుకుపలుకుఁ
బిలిపించుకొనునుదాఁ బలుమాఱుఁదిండికి
నెంతసేపటికిని నేగకుండు
మిన్నుమన్నునుగానక మెలఁతమీఁది
కూర్మిఁ బలువింత వలవంతఁ గుంకుచుండె
నడుమసిరిమెత్తుకొన్నచో మిడిసిపడెడు
ములుచమానిసిఁబోలి యప్పుడమిఱేఁడు. 15

సీ. గట్టువిల్కాని నెక్కటి నోరిచినగండు
చెఱకువిల్తునిమీఁదఁ జెల్లదయ్యె
మింటిమీనును గూలమీటినయుదుటెంతి
కనుమీలమీఁదను గదియదయ్యె
వింటినారలనెల్ల వెఱపించులావన్ను
బొమవిండ్లపైఁజూపఁ బొసఁగదయ్యె

జగములెల్లనుగెల్చు పొగరుగ్మనిపిఱుందు
దీవులమీఁదను దివురదయ్యెఁ
దొల్లిద్రోవది పెండ్లిముందల్లమీను
నొక్కయేటునఁ బడనేసియున్ననాఁటి
మగతనంబేమియు నిచటమఱునిమీను
నెదుటసాగింపలేఁడయ్యె నిపుడుక్రీడి. 16

క. చాలమునుచిల్క చెప్పఁగ
నాలించిన చెలిపిఱుందు నందపుఁజూపున్
నేలకుఁగోలకుఁ దెచ్చెను
వాలాయము తేపిమేనుఁ బలుడెందంబుల్. 17

సీ. ఎన్నితీసినఁ గ్రమ్మఱ నెప్పటట్ల
యూరుచుండెడు బల్ తూపులున్నవాని
రెండుమూడమ్ములున్న మరుండె గెలిచె
నహహా నలువచెయువుల నేమనఁగవచ్చు. 18

ఉ. ఆమనిఁగోయిలల్ చిలుక లామని సేయఁగఁ దాళ లేక లోఁ
దామరకంటి నెన్నుచును దామరలింపఁగరాని కోర్కితో
వేమఱుఁ దుంటవిల్లుగొని వేమరుఁడేయఁగ నొచ్చికుందు నా
లేమనుజూడ కిప్పుడెటు లేమనువాఁడ నటంచు నిచ్చలుల్. 19

గీ. ఏకంతబున ననబోఁడి నెదనుదలఁప
నేకతంబున ననవిల్తుఁడేయకుండు
నలరువింటను నన దూపులల్లఁ దొడిగి
యలరువింటను నడయాడు నరదమెక్కి. 20

వ. ఇట్లు చెఱకువిలుకాఁడు పఱపు కఱకుటంపఱ నెఱకులు దూఱ
నోరువలేక యాకవ్వడి పడంతుక తనకన్నులం గట్టినట్టులయినఁ
దనలోఁదానిట్లని పలవింపదొడంగె. 21

చ. కలికిరొ యిప్పుడేమి యలుకాయలుకా పలుకాడవిట్లు న
న్నలమటఁబెట్ట నాయమగునా తగునా తెగునాయిఁకింతటన్
వలపిది యేలుకొమ్ము మగువా తగువా పగవానియట్లు నన్
దలఁపఁగ జాలిచూపవలదా వలదావలఁదాళనేర్తునే. 22

ఉ. నాయనుఁగున్నెలంది తగునాయను నీవెత సైఁచువాఁడ నే
నాయను మీఁదఁ దాళఁగలనాయను నన్నిటులేఁచనాయమా
నాయనుఁ గూర్మిఁదప్ప నగునాయనుఁ జక్కనిగుజ్జుమోవి గ
న్నాయనుఁ గిన్కఁజూప నదనాయను నేఁబగవాఁడనాయనున్. 23

వ. అనిమఱియుం దనలోన. 24

ఉ. దానిమెఱుంగు జెక్కులును దాని చవుల్దులకించు మోవియున్
దాని నిగారపుందొడలు దానికనుంగవ దానిగుబ్బలున్
దాని యొయారపున్నడలు దాని చొకారపుమేని చెల్వముం
దాని మొగంబునందమును దాని హొయల్లనఁగాంచు టెన్నఁడో. 25

వ. అని యిట్లు. 26

గీ. పుడమియంతయుఁ గలిగియుఁ బాడవుమలల
వంటి పసిఁడిగుట్టలుగల్గి పడఁతిపిఱుఁదు
దీవులను జన్నుహొన్ను బిందియలఁగోరు
ననయమాతఁడు దొరలకుఁ దనివిగలదె. 27

సీ. నెలఁతుకమోవి త్రేనియలానఁగాఁగోర
నేచవియును నాల్కకెక్కదయ్యెఁ
బడఁతుకమైతావి పసయొఱుంగఁగఁగోర
ముక్కునకేతావి సొక్కదయ్యెఁ
జిలుకలకొల్కి నున్బలుకులువినఁగోర
వీనులకేపాట వెలయదయ్యెఁ

గ్రాల్గంటి నెఱిసోయగముఁ జూడఁగాఁగోర
నోంజేదికన్నులకొప్పదయ్యెఁ
దలిరుబోఁడి నెమ్మోయి మెత్తతనముఁగోర
నొడలికిని బడదయ్యెఁ వేఱొకటిసోఁక
నేమిచెప్పుదుఁ గవ్వడియింతినొక్క
దానిఁ దక్కంగ మఱి యున్న వానిమఱచె. 28

గీ. ఇట్లునెలఁతమీఁది యొకఁద్రిప్పుకొనలేక
యలరుఁదోటకేగనన్ని యచటఁ
జక్కఁబడునటంచుఁ జనియెఁ బూఁదోఁటకుఁ
జెలులుకొందఱవలఁ జేరిరాఁగ. 29

సీ. బలుమల్లెమొగ్గలు పలుచాలుదలఁపించుఁ
దుమ్మెదల్ కురులచెల్వమ్ముఁజూపుఁ
జిగురుటాకులు కేలిచెలువంబు వెలయించు
నేనుఁగుల్నెన్నడ నెన్నఁజేయు
దొండపండులుమోవి నిండుచెల్వముఁజెప్పు
సంపంగినసముక్కు పెంపునుడువు
నరఁటిచెట్లు తొడలయందమ్ముఁగాన్పించు
జిలుకలుపలుకుల చెలువుఁదెలుపుఁ
జానరూపును మఱవంగఁ గానకేఁగఁ
దెఱవరూపుఁ దక్కఁగ నన్నిమఱచిపోయెఁ
దప్పనే తానొకతెఱంగుఁ దలఁచుకొనఁగ
దయ్యె నొండొకతెఱఁగుఁ దాఁదలఁచుననుట. 30

ఉ. కమ్మని తెమ్మఁదెమ్మెరలు గ్రమ్మఁగఁ గమ్మనివింటిదంట పూ
వమ్ములు చిమ్మ జుమ్ముమని యామునఁ దుమ్మెదదిమ్ము ద్రిమ్మరన్

గొమ్మలనెమ్మలిమ్మలను గూయఁగఁ జెమ్మట గ్రమ్మినమ్మ లో
క్కుమ్మడి దొమ్మిసేయ దొర యుమ్మలికం బువుదోటఁ గుమ్మలున్.

సీ. అదె కొమ్మ కాఁబోలు ననిడాయుఁగా నున్నఁ
జెట్టుకొమ్మయటంచుఁ జెప్పఁదివురుఁ
గలికి కప్రంపుఁ బల్కులనిచేరఁ గనక
ముద్దుగం బూరంపుముక్కలనును
మోవిచివురటంచుఁ బోవునుగా నున్న
మోవిచెట్టులయాకు మొలకలనును
విరిగుబ్బలవె యంచు నరుగునుగా నున్నఁ
బూగుత్తులంచును బూసఁగఁ బల్కుఁ
గానలోపల నెల్లెడఁ గానిపించు
నలరుఁదీవెలఁ గోయిలపలుకుగములఁ
బొన్నకాయల మంకెనపూలఁ జూచి
చెలిమికాం డ్రకుఁ దనగుట్టు తెలియకుండ. 32

వ. అప్పుడొక్క చెలికాఁడు విశారదుండను వాఁ డదియెల్ల నల్లన నల్లంబునం దెల్లంబుగాఁ దెలిసి మెల్లనఁ దన ప్రోడతనంబు వెల్లడిగాఁ గవ్వడి యొడలు నెవ్వడిందడవి యాతనితోడ జాడగా నిట్లనియె. 33

ఉ. దేవర మేని కాఁక చలిదేరెడు తావులఁ గుల్కు కొమ్మలం
దావలి మేలికొమ్మఁగని యారసి యావిరిగుబ్బగుత్తులున్
బ్రోవగు కప్రపుంబలుకు ముత్తములుం బలుమల్లెమొగ్గలున్
మోవి వొకాటపుం జిగురుఁ బూనికఁ గూర్చినఁ గాక మానునే. 34

గీ. ఇపుడు కాఁక దీఱ నెందైన నారసి
గొబ్బునను గడంగి కూర్మిచిలుక

వెలయు పంచదార పలుకులు నీకబ్బఁ
జేయవలయు నేమొ చెప్పుమయ్య. 35

వ. అనినం గూరిమిచెలికాని నేరుపు మాటలచేత నాతండు చిలుకకుం దనకు నడచిన నుడువులచందంబును దనడెందం బొక్కచక్కెర బొమ్మపయిందగిలి మక్కువం జిక్కియున్న తెఱంగును నెఱింగెనని తలపోసి తెంపుచేసి, యింక నెయ్యునికడం దన యుల్లంబులోని కోరిక చెప్పక కప్పిపుచ్చుట కర్జంబుకాదని యెంచి వెంటవచ్చినవారి నెల్లర నాయాపనులు చెప్పి సాగనంపి మంతనంబున సంగడికానితో రాచిలుకలు వచ్చినది మొదలుకొని నేఁటిదనుకం జరిగినదంతయుం బూసగ్రుచ్చినట్లుగాఁ దెలిపి యిట్లనియె. 36

ఉ. ఇట్టుగనుండె నా తెలివియెల్ల నిఁకేమని తిట్టుకొందు నాఁ
డట్టులు ప్రేముడింజిలుక యాచెలిసుద్దులె తెల్పుచోఁ జెవిం
బెట్టక యూరకుంటి నిటుమించినదానినె త్రవ్వుకొంచు నేఁ
డిట్టులు కమ్మవిల్తు విరివేట్లులు నాఁటఁగనుంటి నక్కటా! 37

ఉ. గుట్టునఁజేడె వీడదుగఁగోరిక లీరికలెత్తినోరికిం
దోట్టినయంతఁబంతమున దోసపుసిగ్గొక టడ్డువచ్చినన్
గట్టిగ నోరునొక్కఁ దమిగన్పడనీయక కట్టిపెట్టి యా
పట్టున రాచనీటు గనుపట్టఁగ వట్టిమెఱుంగువెట్టెతిన్. 38

ఉ. ఏనపుడంతయున్వినియు నిట్టటుపల్కక యూరకుంట యే
మో నగుఁబాటుగాఁ దలఁచి ముందఱనెద్దియుఁ బల్కఁగొంకి నా
యానతిఁబొంది చిల్కచని యవ్వల నెల్లిద మైతినంచయో
తానెదఁ జిన్నవోయెనొకదా యిఁకదానికి నేమిసేయుదున్. 39

క. అనిమిగుల వగలఁబొగిలెడు
నను(గుం జెలికానిలోని యలజడి వోవన్

జనువున మాటలుచెప్పఁజూచుఁ
గొనిచనియె విశారదుండు కొండొకయెడకున్. 40

క. అటునెయ్యునిఁగొని చనుచుం
దటుకునఁ జెలికాండ్రకెల్ల దగుపనులెలమిన్
దిటవుగనుజెప్పి వారల
నటునిటువడిఁ బంపివేసి యాకఱ్ఱదోఁపన్. 41

వ. ఇంతంతనరాని సంగడికాని వలవంతం దలంచి తల పంకించి మరుని
మీఁదఁగినుక వొడమి. 42

గీ. మూఁడు కన్నులవానితో మొనసిమున్ను
చచ్చిబ్రతికియు వలఱేఁడ చలముతోడ
వేయికన్నులదేవర బిడ్డమీఁది
కే మొగంబునవచ్చితివిపుడుమరల. 43

గీ. అనుచు మరుదూఱిముందుచేయుంగ వలయు
కర్జమెదలోనఁ దలపోసి కాంచియొకటి
మదికి సరిపడ్డపిమ్మటఁ బొదలువేడ్క
సరగఁ గ్రీడికిట్లనియె విశారదుండు. 44

సీ. మ్రుచ్చులచేనల్ల పుడమివేలుపునిన్న
నావునుగోల్పోయి యారటమునఁ
దనయావు విడిపింపుమనుచు నీయొద్దకుఁ
బరువెత్తుకొనివచ్చి పలుఁదెఱఁగుల
వేఁడిన నాతనివిన్నపంబాలించి
కనికరంబున మదికరఁగఁబాఱి
విల్లుదెచ్చుటకును వెడలి పరాకున
నన్నద్రోవదితోడనున్నతఱిని

బడకయిలునీవు వడిఁ జొరఁ బాఱుకతన
మున్ను మీలోన మీరు చేకొన్నయట్టి
కట్టుఁబాటున నొక్కయేఁడట్టెనీవు
పుడమివలనొని తిరుగంగఁ బూనలేదె. 45

క. ఈపంద్రెండు నెలలు నే
నోపిక నీతోడఁదిరిగి, యొక్కటవినుమే
నాపడఁతుక యూరారసి
యేపగిదినినై ననీకు నింతినిఁగూర్తుక్. 46

గీ. ప్రతినకడచను సందాఁకఁ బదిగనీవు
తమకపడకుండ నెట్లైనఁ దాళుకొమ్ము
పిదప నీకోర్కిపండింతు మదినినమ్ము
మనుచు నోడఁబడఁగాఁ జెప్పి యతనిఁగొనుచు. 47

గీ. చనియె రాచనగరికి విశారదుండు
క్రీడి పయనంపు వేడుక క్రేళ్ళుదాఁట
నెప్పు డెపుడంచు నిముసంబె యేఁడుగాఁగ
నుండెఁ జిత్రాంగదయుఁ దనయూరియందు. 48

ఉ. ద్రోవటిపెండ్లియప్పు డొకతూపున మచ్చెపు జంత్రమేసె నం
చావలవీరువారు నటనాడికొనం జెవులార విన్న దాఁ
గావున నాఁటనుండి మదికవ్వడియందునె నిల్పియుంట సం
దై విరివింటిదంట యలరమ్ములు చిమ్మెను గొమ్మకొమ్మనన్. 49

గీ. ఇంతితెఱఁగంటి దారపట్టి నెదను నిలుపఁ
దనకుఁ దెఱగంటితనమబ్బెననఁగ నపుడు
విడిచెనిద్దర తిండియు నుడిగిపోయెఁ
బ్రొద్దులెంతయుఁ పడఁతికిఁ బొడవులయ్యె. 50

గీ. నిదుర లేకుంటఁ జెమ్మట నిండుటయును
వెసను వేల్పుఁదనమును మానిసితనంబు
నెపుడు నెమ్మేనఁ గాన్పింప నెల్లతఱిని
గాంచె నరమోడ్పు క్రాల్గంటి కన్నదోయి. 51

సీ. పువ్వులుముడువదు పూఁబోఁడియయ్యావి
తోఁపవిందునల్లుని తూపులనియొ
యద్దంబుఁజూడదుముద్దియ ఁదానఁ గ
న్పడుమోము మున్నిటిపాపయనియొ
కరులుచేముట్టదు విరిబోఁడియయ్యావి
క్రొవ్వారుతుమ్మెదగుంపులనియొ
చెలులపల్కులు వినదెలనాగయవియెల్లఁ
జిల్కమొత్తంబుల పల్కులనియొ
యంతకంతకు వలవంతవింతదోఁప
మరుఁడు పూములుకులడరించి కరమునేఁప
నెడఁదఁ గవ్వడిపయిఁగోర్కి యేపుచూప
సన్నగాలియు నెమ్మేని చెన్నుచూప. 52

చ. చెలులను మాటికింగదుముఁ జిల్కలఁ బల్మఱు వీసడించు నం
చలఁదఱుముం నెమళ్ళనొగిసారెకుఁ బాఱఁగఁదోలు గండుఁగో
యిలపలుకుల్ వినందలకు నేఁచికలంచును గోరువంకలన్
గలికి మదింగడింది వెతగల్గిన రోఁతలుగావె యన్నియున్. 53

గీ. బోటినెమ్మను బంగారవాటనపుడు
కమ్మవిల్కానిచిచ్చునఁ గరఁగుచున్న
దోయనంగ మైఁజెమ్మట యొప్పుమీఱి
వెల్లువగుచును బాఱెను బెల్లుదనరి. 54

సీ. ఆవెల్లతఁత్రాడి యతఁడొడల్సేర్పక
వెలనువెండ్రుకఁగట్లఁ జులక నగునె
యల్ల మానిసిసింగ మక్కునఁజేర్పక
యించువిల్తుని బెదరింపనగునె
యాపజదొరచక్క నామోముదార్పక
కొదమరాయంచలోఁ గొనఁగనగునె
యల్లజగముచుట్ట మల్లరించియేలక
తుమ్మెదదిమ్ముపైఁ గ్రమ్మనగునె
యనుచు నయ్యింతి సగముగు నంతకంత
కౌగినిలిచినచోట నిలువకుండుఁ జెల్ల
దనముపూను వెన్నెలకును దలముడుంచుఁ
దలిరువిల్కాని కాఁకకుఁ దాళలేక. 55

గీ. చిగురుబోఁడికిఁ గోయిలల్ పగవియయ్యెఁ
గొమ్మ కెంతయుఁ దెమ్మెరకూళయయ్యె
నలరుఁబోఁడికిఁ గిట్టనివయ్యెఁ దేంట్లుఁ
దమ్మికంటికి రేఱేఁడు దాయయయ్యె. 56

చ. మరునకుఁదూపు నేనరయ మామవునీవును గాననట్టిచో
నిరువురకిట్టి వట్టిపగయేటికిఁ బాటియె యంచుఁదెల్పి చం
దురుమది దేర్ప నాతని నెదుర్కొనఁ దామరచేరెనో యనన్
దరిమోఁగఁ జేర్చెఁ జామ చెయిదామరచెక్కున వెచ్చనూర్చుచున్. 57

ఉ. కన్నులకాటుకంగలిసి కల్కిచనుంగవమీఁద జిందు వా
ల్గన్నుల నీటితుంపరల గారవమొన్నఁగనయ్యె నయ్యెడన్
జెన్నెసలారుతామరల చెల్వపుఁదేనియలాని యంతటన్
గ్రొన్ననగుత్తులంగదియు గోరికనేగడు తేఁటులో యనన్. 58

ఉ. పుత్తడిచాయ మోమునకు ముక్కున కత్తికిఁ జెక్కుదోయికిన్
బొత్తుగ వెల్లదమ్మినవుఁబువ్వును జిందము నిగ్గుటద్దమున్
గుత్తగఁ బోల్చి కబ్బముల కూర్పరులాడినమాట వెల్లనా
నిత్తఱిఁ జానమేను తెలుపెక్కెను బువ్విలుకాని కాఁకలన్ 59

ఉ. అప్పుడు ముద్దురాలివితమారసి సందియమొంది నెచ్చెలుల్
మెప్పొదవంగఁ జేరఁజని మేకొనియించుక పట్టిచూచి కే
ల్నిప్పులమీఁదఁ బెట్టినటు నెట్టనఁదోఁచిన నులుక్కుచెంది యా
యొప్పులకుప్పతోడఁ జెలులొక్కట నిట్లనిరుమ్మలంబునన్. 60

సీ. వీనుదోయికిఁ జాల విందుసేయుచు వీణె
మెల్లన కొనగోట మీటనేమి
ముద్దుఁబలుకుల నింపుపుట్టంగ నెప్పుడుఁ
బెంపుడుఁజిలుకలఁ బిలువవేమి
యఱచేతఁ జప్పటల్ చఱచి హెచ్చరికతో
నింటి నెమ్మళ్ళనాడింపవేమి
చవితిచందురుదూఱు చక్కనినుదుటిపైఁ
దేటకస్తురిబొట్టు దీర్పవేమి
కలికిరాయంచబోదల గారవించి
తీరుగా నెన్నడల్ తగదిద్దవేమి
మేలిమిపసిండి క్రొంజాయమీఱఁజాలు
మేన నాడెంపుఁ దొడవులుపూనవేమి. 61

గీ. మగువ నీ తెఱఁగేమియో మాకుఁ జూడ
వింతగాఁ దోఁచుచును గడువెఱపు గొలుపు
చున్నదిదె వేఁడుకొనెదము నిన్ను మేము
చెచ్చెరను నిదుమదివంత చెప్పవమ్మ. 62

గీ. ఎంతవేఁడిన మదివంత నిగురుబోఁడి
సిగ్గుపెంపునఁ జప్పనఁ జెప్పలేక
యుల్లమల్లాడఁ దలవంచి యూరకున్న
మఱియు నిట్లని రప్పుడా మగువలెల్ల. 63

గీ. ఎట్టిగుట్టును మాతోడనిట్టిదనుచుఁ
బిలిచి చెప్పకుండిన నేఁడు పెద్దయొట్ట
టంచు బాసఁజేసియు నిప్పుడకట మఱుఁగు
వెట్టఁదలఁచుట మిక్కిలి వింతయయ్యె. 64

క. మనలో నిట్టివిగలవా
యని మఱిమఱి మొడలువిఱువ ననుఁగుంజెలితో
మనమనుకొన్నది యిచటని
కనికరమొనయంగ మఱువఁగావలెననుచున్. 65

గీ. అల్లద్రోవది పెండిలియపుడు క్రీడి
చేసిన కడిందిపనులును వాసిగన్న
యతనిచెలువంబుఁ జెవులార నాలకించు
కతనఁ దనడెంద మొక్కట నతనిమీఁద. 66

క. తగులు పెఱిఁగించి యప్పటి
దగు తనతెఱ గెల్లఁ దెలిపి యనుఁగుం జెలియం
దగ మణిరేఖంగనుఁగొని
తగులుపడంగను నెలుంగు దానిట్లనియెన్. 67

చ. కలుగునొలేదొ కన్గవకుఁ గన్నులవిల్తుని నేలఁజాలు నే
ల్పులదొరపట్టి చక్కఁదనముంగని పొంగెడునట్టిమేలు లోఁ
దలఁపఁగ నావనెన్మిగులఁ దక్కువనోములు నోచినట్టి క
న్నులకది పైపయింగలుగునే యడియాసలుగాక య్యాలీ. 68

క. ఎక్కడిసే నెక్కడి జే
డక్కన ననుగారవించు నతఁడనుకొనియుం
డెక్కడ యీవలపుఁగడలి
నెక్కటి నేనీఁదుకొడ యీవేసటతోన్. 69

ఉ. ఎవ్వరిఁబంపుదానఁ జనియిప్పుడు చెల్వునితోడ నాపెతల్
నెవ్వడివిన్నవించి తననేరుపుచూపి మదింగరంచఁగా
నివ్వలవంత నెక్కరణి నీఁగుదునక్కట చిక్కులైననుం
దవ్వులకేగ కియ్యెడను దాపుననుండిన నన్నుఁగామఁగా. 70

క. అనుచుండఁ దలఁపులోనని
చనుదెంచెను జిలుకకవయుఁ జదలుననటకున్
విని తెక్కచప్పుడొక్కట
ననుఁగుం జెలులెల్ల తెప్పలార్పకచూడన్. 71

గీ. చేరవచ్చి చిత్రాంగద చేతిమీఁద
వాలి ముద్దిడి సేమంబువరుసనడిగి
పలుకు వెలఁదుక తమ్మియ్యఁబంచినట్టి
యీగిమ్రాఁకుల క్రొవ్విరులెలమినిచ్చి. 72

చ. నలువ జగంబునందలి వినందగువింతలు కొన్ని తెల్పి యా
వలఁ దమ కూర్మినెచ్చెలిని బొఱఁగనుంగొని యామెమేను మి
క్కిలి వసివాడియుండుటయుఁ గీడ్వడిమోహమునఁ దొంటితెల్వి యి
మ్ములఁ దిలకింపరామియును మున్గల వంతసపాటులేమియున్. 73

క. కనిపెట్టి డెందమంకున
వనటం దిగులొంది శోడివారల నెలమిన్
ననబోఁడి యట్లు చిక్కట
కును గతమడుగంగ వారు కూరిమిమీఱన్ 74

ఉ. మున్నులమింటిమీను నొకముల్కినిగూలిచి క్రీడి ద్రోవదిన్
గొన్న తెఱంగు జవ్వనులకుం గడునాసలు గొల్పురూపునుం
గన్నది వేయినోళ్ళ ముదుకల్గొని యాడఁగ నాలకించి యీ
యన్నులమిన్న పొంగి మొదయాతసపై నెలకొల్పి, నెవ్వగన్. 75

క. కందుచు నెవ్వరితోఁదన
డెందంబునకోర్కి వెల్లడింపక లోలో
వందురి యంతంతకు మెయి
యందముచెడ సన్నగిల్లి యలసగమైనన్. 76

ఉ. తత్తఱమొందిదీనికిఁ గతంబెఱిఁగింపఁగదమ్మయంచు మే
మిత్తఱి వేయిచందముల నీమెను వేఁడిన నెట్టకేలకున్
బిత్తరి యంతయుం దెలిపి బేలతనంబునఁ బల్కులాడి తా
నుత్తలపాటుతోడ మిము నొక్కటఁ జేకొని మీరలుండినన్. 77

క. తనకియ్యెడఁ గడుఁదోడయి
పనిపూనికడిందికోర్కి పండింత్రుగదా
యని వేచియున్నదిదె మ
న్ననమీచెలి నప్పగించినారము మీకున్. 78

ఉ. మా బరువంతయుం దొలఁగె మాచెలియన్నిముఁ గూర్చినార మిం
కిబలితంపుఁ గర్జమెటు లీరలుదీర్చెదరో సుఁడీ యనన్
జాబిలి చల్వచూపులను జామునుగన్గొని మంజువాణి గా
రాబము మీఱనిట్లనెఁగరమ్మును జేనియలొల్కుపల్కులన్. 79

సీ. మేమిద్దఱముమున్ను మీయొద్ద సెలవొంది
నలువజగమ్మున కలరువేడ్క
మింటను జనుచుండి మిట్టలుపల్లముల్
చదునునేలలయట్లు మదికిఁదోఁపఁ

గుప్పముల్ పల్లెలుఁ గుప్పవోసినయట్లు
కనువింపుగాఁగను గానఁబడఁగఁ
జెఱువులుమడువులుఁ జిన్న యద్దపుబిళ్ళ
లట్లుచూడ్కికిఁ జాలనందగింప
వేడ్కఁబడుచును నెడనెడ వింతలెల్ల
నొండొరులతోడఁ జెప్పుకొం చొక్కచోట
నూరిపటిగడ సింగార మొలుకుచున్న
పూవుఁదోఁటలో నొక్క క్రొమ్మావిక్రింద. 80

సీ. బవరిగడ్డమువాని బవడంబుఁ గ్రొత్త చెం
దొవడంబుఁదెగడు కెంద్దోయివాని
తలిరుఁ బాయమువాని వలతేనినిండుక
ల్వలతేని నగిమొగు చెలువువాని
తళుకుఁ జెక్కులవాని తమ్మిలమీల మొ
త్తమ్ములనగు కన్నుదంటవాని
తేనెమాటలవాని తేఁటులఁగివ్వఁజా
తేటలనగుసిగతీరువాని

చెలులతోడను ముచ్చటల్సలుపువాని
కవ్వడినిజూచి యాపోయగంబునకును
నెచ్చెరువుపొందుచును క్రిందికల్లడిగ్గి
కంటిమాతనిఁ గన్నులకఱవుతీఱ. 81

సీ. దొరలేనిదొరమోవి దొండపండెన్న సే
చిలుకలకొల్కిలోఁ దలఁపకుండు
పుడమిమేలికమేని బుజము తూడులఁ జెప్ప
వేయించయూన కన్నిడకయుండు

నలతేటిమోము వెన్నెలతేనెఁగొనియాడ
నేకల్వకంటి లోనెంచకుండు
నొడయనిపొక్కిలి మడువుతొక్కొన్న నే
జక్కవచంటిలో స్రుక్కకుండు
నట్టిజెగజెట్టిఁ జేపట్టునట్టిమేలు
పొదలు నిమ్ముద్దరాలికి నొదవెనేనిఁ
బదిలముగఁ బదియార్వన్నె పసిఁడితోడ
మంచి కెంపునుగూర్చిన మాడ్కి యనుచు. 82

క. తలపోసి యతనిఁ గన్గొని
వెలయన్మముఁ దెల్పికొంచు వెలఁదుకనచ్చోఁ
బలుకుల వెంబడిఁ బేర్కొని
చెలువెల్లనుబొగడి మున్నె చెప్పినదానన్. 83

క. చెప్పినదంతయు నూఁకొని
యప్పట్టున నాతఁడిట్టునట్టును ననకా
చొప్పు మఱపించి నేరుపు
చొప్పడ వేఁజొక్కకతనఁ జొన్పెనువన్నున్. 84

ఉ. అంతియచాలునంచుఁ దఱుచాడక యుత్తరిసూరకుండి నా
యంతనుభోయితిం బయనమై సెలవాయనయొద్దఁబొంది పి
న్పొంతల నల్వవీటికిసి ముద్దియ సీమది గొంతివట్టిపై
నింతగనిల్చియుంట యొక యింతయు నప్పుడు నేనెఱుంగమిన్. 85

క. అనిమఱియు నేమొచెప్పఁగఁ
జనుచిలుకం జెప్పనీక సడలినతాల్మిన్
గనుఁగొనల నీరు కాఱఁగ
ననిమెం జిత్రాంగద గడు వగలుపొంగన్. 86

క. అక్కటికమించుకయు లే
కక్కటికితనంబుఁ బూన నగు నాయుల్లం
బక్కట క్రీడికి నదియును
నిక్కము నేఁ జేసికొన్న నెఱదోసమొకా. 87

చ. పసితనమేగి జవ్వనము వచ్చినయంతటినుండి నెమ్మదిన్
విసువక కోరుచెల్వుఁడఁట వేనను నొల్లకయుంట యిద్దియున్
బసదఱుగంగ వీనులవినంబడియుం దెగలేక మేనిలో
నుసురులు దాల్చెద న్వెతలకోర్చి యెంతటిదోసకారినో. 88

క. వానిం గలయఁగ నగునని
యేనెంతో యాసపొంది యిన్నాళ్ళుండం
గా నేఁటికి నిటులాయెను
వానిఁ గలయులేని దొక్క బ్రతుకే తలఁపన్ 89

ఉ. ఆసను ద్రెంపలేక యిటులందసిమ్రాఁకుల పండ్లకూరకే
వేసరఁగొంతుసాఁచినను వీసమువాసియుఁ గూడివచ్చునే
మీసరివారు మెచ్చుకొన మేనుతొఱంగెదనమ్మలార నా
యాసలు నేఁటితో విడువుఁడందఱుఁ గేల్గవమోడ్చి మ్రొక్కెదన్. 90

వ. అనునంత నయ్యత్తఱిఁ జెలికత్తెలు తత్తరపడి యింతంతనరాని యుత్తలంబున రంతులుసేయుచుఁ బలువురు పలుమాటలాడి యాబోటి నమ్మందలింపఁ జొచ్చిన నచ్చిలుకకలికియుఁ దనలోన. 91

ఉ. కైకొనకుండరాదు మనకన్నులముందఱ నేఁడెపుట్టి తే
పేకడతేఱువారి మన మెందఱఁ జూడము చావనంగ వే
ఱే కొనితేరఁగావలెనె యేనిఁక నొప్పరికించి లోని యీ
వీఁకనడంపకుండినను వేయటుపోనెటువచ్చునో కదా. 92

వ. అని తలంచి యామించుబోఁడిం దిలకించి. 93

గీ. ఏల యీలాగునిండిన యింటిలోనఁ
గుడిచికూర్చుండి పనిలేని గొడవయొకటి
పైనివేసుక పొగలెదు పడఁతిమిన్న
చాలుఁబదివేలువచ్చె నీచలము విడువు. 94

గీ. తానుబోయిన పిమ్మట దేనితోడ
నైనఁబనియేమి తెంపుసేయంగవలదు
తలఁపఁజనునమ్మ నీయంతదానికిట్టి
వెడఁగుఁబనులక్కటా యెంతవెఱ్ఱివీవు. 95

ఉ. చానరొ పోలుపాం దెఱుఁగఁజాలక యూరక కుందనేల ని
ద్దీని ననంగఁగొట్టమున నీవలిగుంజను గట్టుమన్న నే
మైనను జెప్పఁగాఁదరమె యాతఁడు నాఁడటు మాఱుపల్కకే
మానినదానికింగతము మన్నన విన్నను గాక నాకిఁకన్. 96

గీ. అనుడు నాచిలుకలకొల్కి యవలఁ జిలుక
చెప్పఁబోయెడు సుద్దిని జివరదనుక
వినెడువేడ్క యువ్విళ్ళూర వెచ్చనూర్చి
యీవలావలి చెలులతో నిట్టులనియె. 97

గీ. మదికళంకఁజేసి యిది యనంగాఁదగు
నిదియనఁదగదనెడి యెఱుకలేక
యేమియొ పలికితి నింతెకా కసురులు
విడువఁదలఁప నంత వెఱ్ఱినమ్మ. 98

గీ. అకట నవ్వుటాలకూరకే యన్నమాట
నిజముఁగాఁబట్టి యిపుడింత నెలఁతలార
పట్టిపల్లార్చి నామీఁద వట్టి లేని
పోని వాదు వేయుఁగఁ బాడియౌనెమీకు. 99

గీ. రవ్వపెట్టెక యుఁకన్నైన రమణిమీఁఱ
జాలిమెయిఁజిల్క యేదియో మేలిపలుకు
చెవినివేయంగ నుఁకించెఁ జెలియలార
వినఁగ నీరమ్మ్రమొక్కెద వీనులలర. 100

వ. అనుడు నప్పుడప్పుడంతులెల్ల జప్పుడు సేయక యొప్పులకుప్పయగు నప్పొలుగుచెలువ యొప్పిదంబుగాఁ జెప్పఁబోవు నెప్పుమాటల చొప్పెఱింప నుల్లంబు లువ్విళ్ళూరనూరకున్న నాచిలుకకలికి కలికి పలుకుల నాచెలువల చెవులకుఁ జవులుగొలుపుచు గిలుకుటెలుంగున నిట్లని చెప్పందొడంగె. 101

సీ. అలపూవుఁదోఁటలో బలుకువెంబడిమున్ను
పొలఁతినీరూపు నేఁబొగడినపుడు
వలపు డెందములోనఁ గలిగియుఁగొండంత
యొక్కింతయును వెలికుబ్బనీక
యగ్గలంబుగఁదొట్టు సిగ్గుకతంబున
దానినంతయు మదిలోనెయడఁచి
కల్లగుట్టొకయింత కాన్పింపఁబైటికి
నౌనుగాదనుమాట యనకయుండె
నువిదరో యంతెకాని వేఱొండుగాదు
వినుము వినుపింతుఁ దరువాత వెఱ్ఱియగుచు
వలపుతలకెక్క నాతఁడు మెలఁగినట్టి
నడత చందమించుక తేటపడఁగ నీకు. 102

ఉ. నిన్నను నల్వవీడుకొని నేనరుదెంచుచుఁగంటిఁ ద్రోవలోఁ
బెన్నకుఁ జేరువం గనులవిందుగఁ జెన్నగునొక్కకోనయం
దున్నగుడారముం దటిసియొప్పెడు మామిడి గున్నక్రింద వే
గన్నులవేల్పుపట్టి చెలికాఁడొకఁడూఁతగఁ గూరుచుండఁగన్. 103

క. కని వారేమనుకొందురొ
వినవలెనని వేడ్కఁబొడమి వెననాలేమ్రాఁ
కునకుండిగి యొకకొమ్మను
బనివడి నేఁగూరుచుంటి బడలికవాయన్. 104

వ. అయ్యెడ నాకవ్వడి వెడవిలుకానియలజడిం దెలివిచెడి యిదితగు నిదితగదనియెడి యెఱుకలేక యెనుటఁ గనఁబడు వానినెల్లం దడవి యిట్లని పలవింపదొడంగె. 105

సీ. అలలారయంచ తొయ్యలులార మీరైనఁ
జిత్రాంగదకు నన్నుఁజెప్పగలరె
తొగలార మేలిసంపఁగులార మీరైనఁ
జిత్రాంగదకునన్నుఁ జెప్పఁగలరె
పొదలార గండుతుమ్మెదలారమీరైనఁ
జిత్రాంగదకునన్నుఁ జెప్పఁగలరె
విరులార చలువతెమ్మెరలారమీరైనఁ
జిత్రాంగదకునన్నుఁ జెప్పఁగలరె
యెంతవేఁడిన నొకరైన నించుకంత
పలుకనైనను నాతోడఁ బలుకరేమి
నేనుజేసిన తప్పిదమేదియైనఁ
గలదె యెల్లరు నన్నిట్లు చులకసేయ 106

గీ. నేమమున నేను బండ్రెంపు నెలలబట్టి
యిన్నియేళ్ళకుఁజని గ్రుంకులిడినయట్టి
పున్నెముననైన నాకు నాపువ్వుఁబోఁడిఁ
గాంచుమేలైన నొకసారి గలుగరాదె. 107

క. అని పెక్కువగలఁదలఁకెడు
ననుఁగుం జెలికాని లోని యలజడితగ్గన్

మనమిదెచని చిత్రాంగదఁ
గనుగొందము సుమ్మియెల్లి కన్నులుతనియన్. 108

కం. అందాఁక నోర్చుకొమ్మని
కందువమాటలను జెల్మికాఁడొకఁడచ్చో
డెందమునందలి కుందున్
డిందింపుచునుండ నపుడ నేనును గడఁకన్. 109

కం. నీయెడ యీతనిపయి నిటు
లోయింతిరో తగిలియుంట యొక్కింతయు నే
నాయెడ నెఱుఁగమిచే నీ
చాయలవచ్చితిని నంతెచాలు నటంచున్. 110

కం. నమ్ముమిది నేఁట తేషటఁ
గొమ్మా నిన్వెదకిగొంచు గొబ్బునతేఁడీ
యిమ్మున కేతెంచి నినున్
నెమ్మిం జేపట్టు నీదునెచ్చెలు లలరన్. 111

సీ. కాన నూఱడియుండుము నేనుబోయి
యిపుడ మీతల్లిదండ్రుల కెలమి మ్రొక్కి
వారినేమంబు లారసి వత్తుమరల
ననుచుదిగ్గున రాచిల్క లరిగెఁజదల. 112

కం. చిలుకలటుచన్నపిమ్మటఁ
జెలికత్తియలంతిపురికిఁ జెచ్చెరఁ జెలువన్
బిలుచుకొనిపోయి రూఱడఁ
బలుఁదెఱఁగుల దిటవుగఱపి పాయనికూర్మిన్. 113

వ. అటుతరువాత నడచినకత చెప్పుమని జనమేజయుం డడుగుటయు. 114

మాలినీవృత్తము

జగము లరయువాఁడా సాదులం బ్రోచుతేఁడా
పొగరుఁ బసులగొంగా పూసబల్వెన్నదొంగా
పగఱెఱుఁగనివేల్పా పైఁడిపుట్టంబుదాల్పా
వగలుతొలఁచుమిన్నా వాసిగన్ గొల్లపిన్నా. 115

కందగర్భిత మణిగణనికరము

చిలువదొరపఱుపు జెలువునఁ జెలఁగన్
సిలుగుల నడఁచెడు సిరిచెలిమగఁడా
నలువయుఁ గొడుకయి నలువుగ వెలయన్
బెలుకుఱఁబగతుర బిగిచెఱుచుదొరా. 116

## గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన
నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందు
కూరివంశపయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్య
పుత్ర సుజనవిధేయ వీరేశలింగ నామధేయప్రణీతంబయిన
రసికజనమనోరంజనంబను ప్రబంధరత్నంబునఁ
ద్వితీయాశ్వాసము.

# రసికజనమనోరంజనము.

## తృతీయాశ్వాసము.

క. సిరియుం బలిమియు సేమముఁ
దిరముగ మదినమ్మి కొలుచు దిట్టల కెల్లఁ
గరము న్నెనరున నిచ్చుచు
నరయుచు సాదులను బ్రోచు నలకరివేల్పా. 1

వ. వైశంపాయనుం డటమీఁద నడచినకత జనమేజయున కిట్లని చెప్పం దొడంగె. నట్లు చెలికత్తియలు పొత్తుగ నత్తెఱవం గొనిచని మనికి పట్టు చేర్చినఁ జేర్చిన మరుచిచ్చునకుఁ దాళఁజాలక చాల జాలిం దూలుచు వారలనేమఱించి. 2

సీ. అలమోవి దొండపండనవచ్చు చిల్కల
జవ్వాజివలపులు సడలఁద్రోయ
బుజముతూడులఁజూచి పోరివచ్చునంచలఁ
దుఱుముక్రొమ్మొగిలింతతోలఁగఁద్రోల
చనుపూవుబంతులఁ గనివాలుతేఁటుల
ముక్కుసంపఁగిమొగ్గ మొనసితఱును
కయికొమ్మల నదల్పఁగావచ్చు తెమ్మెర
నొకట నూగారు పాముదుగఁజేయ
కలికిరూపును గనిచేరు కమ్మవిల్తు
బలఁగముల నాకలికిరూపె పాఱఁజేయ
బోటివెడలెను బూవులతోఁట కపుడు
చెలుల దిగనాడి యొడఁబాటు చెలువఁగూడి. 3

గీ. అంత నింతులెల్ల నెంతయుఁ దలఁకొంది
యింటఁ జెలినిగాన కెల్లచోట్ల
వెదకి తత్తరించి వెలఁదులు త్తలమున
నలరుఁదోఁటఁజేర నరుగుదెంచి. 4

చ. కనిరెలదోఁటలో వలపుగ్రమ్మెడు తమ్మికొలంకువంకఁ జ
క్కని ననదేనె యేటిచిఱుకాలువ కావలిమావిక్రేవఁ బ
న్నిన నెలఱాలమేలిపని నిద్దపుముగ్గుటరుంగు చెంగటన్
బొనరిన కమ్మచెంగలువ పుప్పొడి తిన్నియయొద్ద ముద్దియన్. 5

వ. కని యిట్లనిరి. 6

చ. ఎటువలెనమ్మఁ బాసి యిపుడిచ్చటికొంటిగ వచ్చితమ్మ నీ
వెటువలెఁ బూవునీటి పెనువెల్లువ లీఁదితివమ్మ నీదు కా
ళ్ళెటువలె నోర్చెనమ్మ వెలఁదీయిటు పుప్పొడితిన్నె లెక్క నేఁ
డెటువలెఁ దూఱితమ్మ పొదరిండ్ల నయోతగునమ్మ యిప్పనుల్. 7

ఉ. నీచెయిదోయి కెంజిగురు నీనునువాతెఱ దొండపండునున్
నీచనుబూవుగుత్తులును నీచెలువారు బుజంపుఁగొమ్మలున్
జూచినఁ గోయిలల్ చిలుకజోటులుఁ దుమ్మెదచాలుఁ దెమ్మెరల్
హా చెలి యించుకైన నిను నాఱడిపెట్టక నిల్వనిచ్చునే. 8

సీ. ఒడలెఱుంగక మరుఁడుండి మండిపడును
గూడిత్రేఁటులు కాఱుకూఁతలఱచు
పదరుచుఁ జిల్కలు వడిఁబండ్లుకొఱుకును
పరువెఱుంగక యంచబారసాఁచు
కదిసికోయిలపిండు కన్నులెఱ్ఱగఁజేయుఁ
బొగరున గోర్వంక లెగిరిపడును
మెయిజల్లుమనగాలి మీఁదిమీఁదికివచ్చుఁ
గన్నుగానక నెమ్మిగంతులిడును

గోలతనమున బలుముద్దురాలవగుట
వచ్చితివిగాక యొరులిట్లు వత్తురమ్మ
యించువిలుకాని దడములకిక్కయైన
కారుకోనకు నొంటిమైఁ గలువకంటి. 9

సీ. సారెసారెకువీచు చలువతెమ్మెరకాదు
తియ్యవిల్గలవాని తేరుగాని
యలచెట్లనలరించు నామనిదొరగాఁడు
పచ్చవిల్తుని దళవాయిగాని
పరువులెత్తెడు గొఱవంకగుంపులుగావు
తలిరాకువిలుకాని దండుకాని
తావి గుబుల్కొను తమ్మిమొగ్గలుగావు
కమ్మవిల్తుని తూపుగములుగాని
తేనెలానివెడలు తేఁటిపాటలుగావు
మొనయుమరుని నారిమ్రోఁతగాని
కెలనవిరియు కన్నెగేదంగి పువుగాదు
పూలవిల్తు చేతివాలుగాని. 10

వ. అని చెప్పినప్పు డప్పడంతుక కంతకంతకు వలవంత వింతయయి
చూపట్ట నప్పట్టునఁగల వింతలుచూపి వంత మఱపింతమని యెంచి
మించుబోం డ్లమ్ముద్దరాలిం బూలుగోయుదము రమ్మని తోడుకొని
చనుచు నిట్లనిరి. 11

చ. చిలుకలకొల్కి కన్గొనుము చెన్నగుతీవియఁ జిక్కకొల్లచే
నలరుచు దొండపండు దనరారెడు డెందముపొంగఁ జెల్వునిం
గలసిన పంటినొక్కలను గందియు ముద్దులుగుల్కుచున్నయు
గ్మలిచెలువంపుఁ గెంపెదవికై వడిఁ గ్రాలుచునున్న దెంతయుఁ 12

చ. కనుఁగొను ముద్దుగుమ్మ సరగన్ గనుఁగల్వలు విచ్చిముందటన్
జనిచని నెమ్మిఁగొండ్లి యటసల్పఁగఁ జూగెను బువ్వఁ దేనియల్
గొని పొగ రెక్క తుమ్మెదలు గుంపులుకూడిచనంగ దవ్వులన్
గనుఁగొని నల్లమబ్బనుచు గ్రక్కున లోఁదలఁపంగఁ బోల్పనిమా. 13

ఉ. అక్కడఁగోయిలొక్కటి రవంతయుఁ బల్కుటమాని యాకులే
మెక్కుచుఁ బెక్కునాళ్ళు గుఱుమీఱఁగఁ గానను నిల్చి యొప్పడు
న్నిక్కపు మావిలేఁజిగురు నిప్పననొప్పుచుఁ దమ్మికంటి తాఁ
జక్కఁగఁ గ్రైకొనెం దబిసిచందము నీనుడిమెచ్చువొందఁగన్. 14

చ. కరువలిపిన్న మెల్లఁజని కమ్మనితావులు గ్రుమ్మరించు న
బ్బురపుఁ గొలంకుఁజేరు తనపొకకునడ్డయి నిల్చియున్న యా
దరి బలురక్కసుల్తలఁకఁ దద్దఁ దలద్దునుమాడి వ్రేల్మిడిన్
విరులనుద్రుంచి కొమ్మకును వ్రేఁగుతొలంచెను గంటివే చెలీ. 15

గీ. అలరుకొమ్మలు చెలువులనల్లఁబొంది
కొమరుపూపలఁ గాంచెనో కొమ్మచూడు
మలరుకొమ్మలు చెలువుల నల్లబొంది
కొమరుపూపలఁ గాంచుట గొప్పయగునె. 16

వ. అని మఱియును. 17

సీ. ఏమన వలఱేఁడు ప్రేముడిపుట్టంగఁ
గలసి డెందంబులో మెలఁగునమ్మ
చలువలఱేఁడు నిచ్చలు వేలుపులత్రోవ
విడిచి యావంతయు నడువఁడమ్మ
మెలదోఁటలోని కోయిల మొత్త మేతఱి
నోరెత్తిమాటాడ నోడునమ్మ
జింక తత్తడిరౌతు చెలఁగి యొకప్పుడు
నొకరికంటఁబడక యుండునమ్మ

త్రెల్లవాఱెతడవ యుంచలెల్ల విడువ
కెంతదవ్వైన వినువారికేగునమ్మ
యట్టివారలచే సిగ్గుపుట్టుటెట్లు
వలదువలవంత యొకయింత వారివలన. 18

చ. మొగిళులఁజూచి సంతసముఁబూను నెమళ్ళును సంచరించు, సం
పఁగిపువుతావులంగొనెడి పట్పదబృంద తుమ్మెదకొమ్మ తమ్ములం
దగిలికలంచుజాబిలియుఁ దామరచాలుఁ బొసంగియున్నియో
ముగుదరొ! సాగదేరఁగొని ముంకుమరుండరుదెంచు నీపయిన్. 19

సీ. నీకంటఁబడినేలనిలుచునే మరుడాలు
నిలువుగ్రుడ్లుపడి తానీరుచారక
నీమాటవిన్నఁ దానిలుచునే మరుతేజి
తోఁకత్రెంచుక కానఁదొలఁగిచనక
నీమోముగన్నఁదానిలుచునే మరుమామ
దిగఁజిక్కిబయలునఁ దిరిగిచెడక
నీచేతఁబడ్డ దానిలుచునేమరుబాకు
వడఁకిమ్రాఁకులనంటిపట్టుకొనక
మిట్టిపాటును నెగరిపాటట్టలంపుఁ
ద్రిమ్మరితనంబుఁ గలకుఁదనమ్ముమాని
మునిఁగి డాఁగి పఱచి కూలి చనియెనేని
యెంతమండిపడిన మరుఁడేమిసేయు. 20

చ. దరిచెడి కానపాల్పడియె దండులు, తూపులువిచ్చిపోయెఁ దే
రరుదుగ మూలఁబట్టెఁ, జెలువారుసిడంబులు నీటిపాల్పడెన్
విరివిరిపోయె నారియును విన్నఁగదాలుపు కంటి మంటలన్
మరుఁడునునీల్గె, గొందలముమానుము పూవిలుకాని దాడికిన్. 21

వ. ఇట్లు నెచ్చెలులెచ్చరించుచుఁ దోడుకొని చనుచు. 22

వృషగతిరగడ

కలికి కలికి మొగంబులం గడుఁగప్పుఁ గప్పురపుందుమూరము
పలుకుపలుకులుగాఁ జనకంటివంకవంకరగఁ జను నేరము
పొదలుపొదలు డాయుఁబోక ననుబోటిబోటిగమి వెన్కనడువు
మొదలమొదల వెఱపుదోఁపనిట మేల మేల కను పెద్దమడువు
కొనకొనన మెఱుదఱియకు కన్నె కన్నెఱఁజేసిచూడకు
మానుమానును గుట్టునివ్వెఱ మాటిమాటికి మమ్మువీడకు
కొమ్మకొమ్మలపండులెల్లను గోయఁగోయని కూయుఁజిల్కలు
నెమ్మినెమ్మినిజూడు మల్లదె నీడనీడను దానికుల్కులు
చెలువచెలువగు పువ్వునిరొగిఁ జిలుకఁజిలుకరాలిచెఁ బూలను
నలరు నలరులురాలెఁ గన్గొను మన్నమన్ననసేయు వేలను
దనరఁదనరవణములూడ నెఱతావి తావిదిరమ్మనిచెలికి
ననుచు ననుచుచేమంతిపొదకు నల్లనల్లనఁజనె నొకకలికి
మంచిమంచిసుమంత కప్పిన మావి మావిడిది మున్నెప్పుడు
మించుమించులబోఁడి పొదమె మీఁదమీఁదడయుడఁగ నిప్పుడు
తెఱవ తెరువది తిన్నగాఁజనితేని తేనియవాఁక తాకదు
నెఱయు నెఱయుప్పరిగవేడుక నించునించుక కాఁకసోఁకదు
పొగడపొగడఁదగి తావుఁననబోఁడి పోడిమిమీఱఁగ్రాలెను
పగలుపగలు మొగముతోనెఱపి వాడివాఁడిమి దమ్మితూలెను
నెన్ననెన్నఁడు గొజ్జఁగులపూవింత వింతగలేదు డాయుము
కన్నెకన్నె గేదఁగి క్రొన్ననఁ గడఁకఁగడకన్నెత్తికోయుము
కొనక కొనకటులేల చూచెదు గోరగోరఁట పూలుద్రుంపవె
మొనయు మొనయురియాడు సంపెఁగమొగ్గమొగ్గక కేలనింపవె
యేలయేలకిపొదవిరి మొత్త మెల్లమెల్లన రాల్పఁజాలవు
గోలగోలనుగొంచు నాకలిగొట్టుఁగొట్టుము నేలపాలవు

జాలజాలగు కాల్వదరిఁజనఁజాగి జాగిటుచేయనేటికి
నాడ నాడుకోయిల యిపుడేమఱచెమఱచెనీనుడి నేటికి
జానజానగు తావితావెదఁ జల్లజల్లని బావిఁగందమె
పూనిపూనికలెల్ల దీఱఁగ మొల్లమొల్లపుఁ దావిగొందమె
యలసియలసిగ పూలురులఁజఱియందయందఱుఁగూరుచుందురె
వెలయవెలయనరాని కొలంకు వేఁడివేడిఁదోలంచుకొందురె. 23

సీ. అడుగులకెంజాయ లలముపట్టులుచూచి
తలిరాకుపడెనంచుఁ దలఁచివంగి
తనచూపుదాలు పర్వినపూలఁ దేంట్లని
చాఁచినకెంగేలు సరగఁదీసి
తగఁబల్వరుసతెల్పు జిగిపర్వఁతీఁగెల
మల్లెమొగ్గలటంచు గిల్లబోయి
యొడలిబంగరునిగ్గు లడరుమ్రాఁకులఁజూచి
సంపెంగననలంచు సరసఁజేరి
యొండొరుల నవ్వుకొంచు నయ్యువిదలెల్ల
విరులుకోయంగఁ జొచ్చిరి వింతమీఱఁ
గలికినడకల నంచల గరువమడఁచి
యందియలు కాళ్ళ గళుగళ్ళు మనుచుమ్రోయ. 24

గీ. చిగురుటాకులు వడిఁద్రుంచెఁ జెలువయొకతె
యపుడ చేతులకసిదీఱునట్లుగాఁగ
మల్లెమొగ్గల వెసఁద్రుంచె మగువయొకతె
యలుకమొయిఁబంటఁ బగపట్టినట్టుగాఁగ. 25

సీ. వడిఁబొన్నవిరిగోసి యొడిఁబెట్టెనొక్కతె
పొక్కిలితో సరిపోల్చుకరణి

వెసఁగోసిసంపంగి విరినిమూర్కొనెనొకర్తు
ముక్కుతోడను సరిపోల్చు కరణి
చిగురుజొంపముద్రుంచి చేతఁదాల్చెనొకర్తు
పొరిఁగేలితో సరిపోల్చు కరణి
మొగలిరేకులుగోట ముట్టిగిల్లెనొకర్తు
మొగిగోళ్ళతో సరిపోల్చుకరణి
దొండపండునుగోటికొ నాతుకయొకర్తు
పొసఁగఁ గెమ్మోవితో సరిపోల్చుకరణి
తీవెమెయినంటఁ జే యెత్తితిగిచెనొకతె
పూని నెమ్మేనితో సరిపోల్చుకరణి 26

గీ. వెలఁదులమ్మామిడిఁ జిగురులు విరులుఁగోయఁ
దూలి నెవ్వఁగఁబొందుచుఁ దోఁటబోటి
యొకటఁ గన్నీరు నించెడు నోయనంగఁ
దొడిమలను నీరుకాఱంగ దొడఁగెనపుడు. 27

వ. ఇట్లు పూలుగోసి యలసి సొలసి యమ్ముగువలెల్లం జెమ్మటలఁ దొప్పదోఁగి నెత్తమ్మికొలంకున నీరాడఁగోరుటయు నచ్చెలత్రాంగద.

గీ. మేలిమగరాలపట్టుల మెల్లనడచి
మెఱుఁగులీనెడు రతనంపు మెట్లుడిగ్గి
వలపుగొలిపెడు తామరకొలనుఁజేరె
నొక్కనెచ్చెలి కేల్దమ్మి యూఁతగొనుచు. 29

క. క్రొవ్వెదనించుకకనుఁగొని
క్రొవ్వెదనించుకయు విడిచి గుంపుగ నంచల్
దవ్వులమొయిలని పాఱెను
నవ్వులపొలయు కొలఁకుదటి నవ్వులివలనన్. 30

చ. చెలువలు సొమ్ములు న్విలువచీరలు నొడ్డునఁబెట్టిపావడల్
బలుచనుకట్లుఁగట్టి పరివారలఁజీరుచు నీరుచొచ్చి రా
పొలఁతులకొప్పు ముక్కు మొగముంగని యంచలుఁదెంట్లుజక్కవల్
జళుకున నల్లమబ్బు జిగిసంపెఁగ చందురుఁడంచుఁ దూలఁగన్. 31

సీ. చిలుకలకొల్కుల చేతులునడుగులు
నెత్తామరగుంపు నినుమడింప
ముద్దులగుమ్మల మోములుఁజన్నులుఁ
బొందామరలగుంపుఁ బుట్టఁజేయ
కలువకంటుల వాలుఁగన్నులచెన్నులు
నాలుగన్నగమి నిబ్బడిగఁజేయ
క్రొవ్విరిబోఁడుల కురుల మొత్తంబులు
నాఁచుతీవెలపెంపునలువరింప
నెలఁత తెల్లను గుములుగానీరుచేరి
యింపుదళుకొత్తఁ బెల్లుగా నీఁదునపుడు
చెలువుమీఱిన నెత్తమ్మి కొలఁకునకును
గరమువింతగఁ గ్రొత్తసింగార మొదవె. 32

చ. చెలువయొకర్తు కెంజిగురుఁ జిమ్మనఁగ్రోవి యమర్చి పూవుఁదే
నెలు చెలిమోముదమ్మిపయి నెమ్మినిజిమ్మినఁ గేలుదామరల్
తళుకుమొగంబుచేరువకుఁ దారుచుటొప్పగుఁ బూవుపీటికిం
దలఁకకు మేముగల్గనని తమ్ములుబోసట వచ్చు నచ్చునన్. 33

గీ. ఒండొరుల కేలుఁదమ్ముల నొక్క మొగిని
నెమ్మొగంబుల పయినీరుచిమ్ముటొప్పెఁ
దమ్మిపూఁదేనియను జూపుఁదుమ్మెదలకు
మించుతమి నోగిరంబుగఁ బాచునట్లు. 34

క. కుంకుమ సోఁకఁగ నెఱుపయి
యింకొకయెడఁ బసపుసోఁక నెలపచ్చనయై
పొంకపుఁ గాటుకసోఁకిన
వంక నలుపయి కొలఁకు పలువన్నెల నమరెన్. 35

సీ. కప్పుకొప్పులనుండి కాఱుచుండెడునీరు
చిఱుతమబ్బుల వానచినుకులట్లు
గబ్బిగుబ్బలనుండి కాఱుచుండెడునీరు
బలితంపుమలల పెన్వాఁకలట్లు
కమ్మమోములనుండి కాఱుచుండెడునీరు
సొగసుచందురు మంచుసోనయట్లు
కలికికన్నులనుండి కాఱుచుండెడునీరు
నెత్తమ్మిపూవుఁ దేనియలయట్లు
వాతెఱలనుండి తగజాలువాఱునీరు
పలుచనగు దొండపండులపాలయట్లు
వింతవింతలఁదనరెఁ గన్విందుగాఁగ
లేమలటనీటిలోమున్గి లేచునపుడు. 36

గీ. పడఁతిమిన్నలుకొలఁకు వెల్వడెడునప్పు
డొడలనంటిన నీటిబొట్లొప్పుమీఱె
నేవళంబుగఁ బెరుగు క్రొందీవగములు
మొగ్గతొడిగినకైవడి ముద్దుగులుక. 37

చ. తనతలచెక్కలంజొనిపి దాపుననొద్దుననంచ పవ్వళిం
చినఁ గనికట్టుపుట్టమని చేడియయొక్కతె కేలనంట ము
క్కునవది కేల్వడింబొడువ గుబ్బెతగొబ్బున నుల్కిపాటునన్
వెనుకకువచ్చె దానిఁగని నెవ్వడినవ్విరి తోడిచేడియల్. 38

గీ. ఇట్లు కోలఁకువెల్వడివచ్చి యింతులెల్లఁ
దమ రవణములు వల్వలుఁదాల్చి పిదపఁ
బువ్వుఁబోఁడిని గై సేసి పూలుదుఱిమి
పొసఁగ మొగమునఁ గస్తురిబొట్టువెట్టి. 39

గీ. మెల్లమెల్లనె యుపరంజిమేడపొంతఁ
బూవుఁదోఁటను గుజ్జుక్రొమ్మావి నీడఁ
జెన్నుమీఱెడు నెలతాలతిన్నెమీఁదఁ
బాలఁతిఁ గూర్చుండఁబెట్టి యాపువ్వుబోండ్లు. 40

క. జాణతనపుమాటల వి
న్నాణముచూపి చెలియమదినాటిన కుందుం
బోనడఁచి ప్రొద్దువోవఁగ
వీణియఁగొనివచి ముందుపెట్టిన వేడ్కన్. 41

గీ. తీగెలుబిగించి సుతి కడుఁదిన్నపఱచి
పూని వీణియను బుజంబుపై నిమోపి
కేలునవరించి సారెల వ్రేలునిలిపి
యెలమిమీఱఁ జిత్రాంగద యింపుపుట్ట. 42

సీ. క్రొవ్వాఁడికొనగోళ్ళ గ్రుచ్చితంతులుమీటు
నందంబు మదిజల్లుమనికలంప
మురిపెంబుగాఁబల్కు ముద్దుతెలుంగున
కల్లనఁగోయిల లరుగుదేర
సొరములుకలిపించి సొగసుగాఁబలికించు
వింతకుఱాలెల్ల వెసఁగరంగ
హాయిలుగాఁబాడెడు నొఱపైనపాటకుఁ
జేరువమోడులు చిగురుపట్ట

తానునెవ్వడిఁ గవ్వడిపై నిమున్న
గూరిచిన తేటపాటను గూర్మిమీఱ
వీణెమీఁదను హాయిగా వెలఁదిమిన్న
వింతగాఁ బాడఁజొచ్చెను వీనులలర. 43

ఉ. అయ్యెడఁ గ్రీడి వేడ్కమెయి నచ్చటికిం జనుదెంచి మించి యా
తొయ్యలిఁ గాంచుజాడ మదిఁ దోఁచక యారయు చింతలోపలన్
నెయ్యునిఁగూడి యయ్యడవి నిల్చి మెకంబులవేఁటలాడఁగా
జయ్యననెంచి కొంతవడి సల్పె మెగంబులవేఁట వింతగన్. 44

గీ. ప్రోలిచేరువ కానలోఁ బ్రొద్దుగడపఁ
గొంతవేటాఁడి మెగములఁ గుప్పగూల్చి
యేటుపడి పాఱిపోయిన యెలుఁగువెంట
నంటిచనుదెంచి యాపాట యాలకించి. 45

ఉ. చెంగటఁ బాటబాడుచును జెల్వలతోడను దోఁటలోనఁ జి
త్రాంగదయుంట జాడమెయి దవ్వులవారలచే నెఱింగి యు
ప్పొంగుచుఁ జెల్మికానిఁగని పొందొడఁగూర్పఁగ మంచిసందిదే
ముంగలఁజేకుఱెన్వడిగఁ బూనిక నల్పుమటంచు నిట్లనున్. 46

చ. ఎటువలెనేకతంబచని యింతికడన్నను గానిపించెదో
యెటువలెఁ బల్కరించెదవొ యెట్టుగ మన్నన లందిమించెదో
యెటువలె నేర్పుచూపెదవొ యెట్లుగసూటిగ మాటలాడెదో
యెటువలెనమ్మఁ గూర్చెదవొ యీయది నీయదిసుమ్మనెచ్చెలీ.

చ. వెలఁదులుచుట్టునున్నపుడు వేఱొకసందడి నున్నయప్పుడున్
వెలయఁగనా తెలుంగు కడువేగిరపాటున ముచ్చటించి యా
చెలువకు నన్ను విన్నపముసేయకు మన్నిట జాణవీవు నే
నెలమిని వేఱచెప్పవలెనే తగునట్టులె చేయఁగాఁదగున్. 48

క. ఒప్పుల కుప్పయనంజను
నప్పడఁతికి నామదిఁగల యలజడియెల్లం
జెప్పి కరంచక యేమో
చెప్పితినని నీవసడ్డచేసెదుసుమ్మీ. 49

వ. అనిన నవ్విశారదుండు నవ్వి కవ్వడితోడ. 50

గీ. ఎంత దేవర పనియున్న నింతలోనఁ -
బూని పండించుకొనివత్తుఁ బోసఁగఁబలికి
యానతియొయన్న నెయ్యంబుగానిపించు
నెలనగవునవ్వి తలయట్టి యెగర వైవ. 51

చ. అలయది సన్నగానెఱిఁగి యాతఁడుసామి హోసాదటంచు రెం
డడుగులు ముందుసాఁగి మొగమల్లన తేనిదెసన్మరల్చి చే
తులువడిమోడ్చి సంతసముదోఁపఁగ నిచ్చట నున్న యట్టులే
తలఁపుము పోయివత్తునని దారినిసాఁగెను వేగనేగఁగన్. 52

సీ. నెలఱాల నేల పజ్జలఁగ్రాలుగోజ్జంగి
పువునీటియేటి వెల్లువలుదాఁటి
కపురంపు టంటికంబపుగుంపునంటిన
తుదిదారిగోరింట పొదలుదాటి
యల్లిబిల్లిగ నల్లు మల్లెతీవెలనల్ల
మెలత్తేఁటిమేటి పాటలకునలరి
సురపొన్నగున్నల దరినున్నతిన్నెల
పయిసోలి మేలితేనియలుగ్రోలి
తావిచెంగల్వబావుల క్రేవనడిచి
కన్నెగేదంగిపొదరిండ్లు గాంచిమెచ్చి
క్రొత్తజవ్వాజివలపులు గుత్తగాంచి
గుజ్జులేమావినీడల పజ్జనరిగి. 53

మ. కనియెం బాఱుఁడు తోఁటలోపలను వాల్గంటిన్నిగారంపుఁ గ్రొ
న్ననబోఁడిన్ లతకూనఁగన్నియలమిన్నన్ బిత్తతిన్మద్దియన్
ననవిల్కాని కడింది పూవులికిఁ జానన్ జాజిపూబంతి మిం
చిన మేల్వన్నె పసిండిబొమ్మఁ జెలియన్నింగారి లేజవ్వనిన్. 54

సీ. తనయందమీనేలఁ దనరొందఁ బోలుపొంకు
గిట్టురాకన్నె యాఁకలికిమిన్న
తగమించుజిగినొంచుఁదనమించుమెఱుఁగుంచు
కలుములచేడెయీతలిరుఁబోఁడి
మెరుగారువగమీఱు మెయిసొరుగలముద్దు
పలుకులకొమ్మయీపసిఁడిబొమ్మ
తనరొప్పిదమె యెప్పుడును నొప్పఁదగుగొన
ములతమ్మికొమ్మయీముద్దుగుమ్మ
రువ్వఁజని నేనాయలరువిలుకాని
మిత్తినాతమ్మికంటి నా మేలికొలఁపు
టరిదిసామి నాజగముచుట్టంబునిటకుఁ
దెచ్చెదను దీనిసొగసెల్లఁ దెల్పియనుచు. 55

వ. చనుచున్నతఱి నచ్చేరువ నడయాడుచున్న యొక్క నెమలింజూచి
చిత్రాంగద నెచ్చెలులతోడ, 56

చ. అడుగులు మెల్లఁబెట్టుచును నచ్చటనిచ్చట నిల్చిచూచుచున్
వడిఁబొదరిండ్ల చక్కికిఁ జివాలున నేగుచు నెమ్మిజుట్టు బి
ట్టడరఁగవచ్చెడుంగనుఁ డొయారులు మీరలు పాఱుఁడల్లదే
యెడపక వేడ్కమీఱ నెనరేగుఁడు కైకొనిరండు నేర్పునన్. 57

చ. అనవిని సంతసంబుఁ దఱియుంజని పాఱుఁడుకొమ్మఁగూర్చి యొ
య్యనను 'వచ్చెడుంగనుఁ డొయారులు మీరలు పాఱుఁడల్లదే

యని చెలిపిండుత్రోడ మమునవ్వలఁ జూడకమున్నె యిట్లు నీ
వనవిని నంతనుండి మదికచ్చెరువయ్యెడు మూఁడుదొయ్యలీ. 58

క. దవ్వులనాతనిఁ గన్గొని
పువ్వారుఁబోఁడి యొక్క పొలఁతిఁబిలిచి యీ
విప్పచ్చు బాపనికినిడ
నెవ్వడినొక గద్దెఁగొంచు నెచ్చెలిరమ్మా. 59

క. అని తనయనుఁగును గనుఁగొని
గొనబునఁ బనివినఁబనిచినఁ గొనకొనిచని చ
య్యన నిగనిగమనుగద్దియుఁ
గొని చనువును నెనరును బెనఁగొన నటన నిచెన్. 60

వ. అప్పుడతండు. 61

గీ. అదిగో 'విప్పచ్చు బాపఁడంచ' నెడునార
యీ మెయెఱిఁగి నన్నానవాలిడియెనేమొ
పల్కడటులు నీవీవచ్చుబాపఁడంచు
నువిదమదినెంచి యిట్లని యుండఁబోలు. 62

క. అని సందియంబుదొలఁకెఁగఁ
జనియాతఁడు చెంతఁజేరి సరగనడఁకువన్
ననబోఁడి చేయిచూపఁగఁ
గనుసన్నలఁ గూరుచుండె గద్దియమీఁదన్. 63

వ. అంతనప్పుడు. 64

ఉ. త్రోరపుఁబేరులూడ నసదుంగవునల్లలనాడ ముంగురుల్
సారెకువీడఁ గ్రొంజెమట చక్కని చెక్కులమీఁదఁగూడ బం
గారపు గిల్కుటందియులు కమ్మనిపాటలు పాడ నెంతయుం
గూరిమి నేలవేల్పు నడుగుంగవకుం జెలిమ్రొక్కెఁగ్రక్కనన్. 65

గీ. ప్రొక్కి నిలిచినఁ జిఱునవ్వు మొలకలెత్తఁ
బెండ్లికూఁతురవగు మీవు సెలఁదియనుచుఁ
బుడమివేలుపుదీవించి పువ్వొకండు
చేతిలోనుంచెఁ గూర్మితోఁ జెలువకపుడు. 66

ఉ. కన్నులఁ బిన్ననవ్వులయఁ గైకొనికన్నులనొత్తి మన్ననన్
గ్రొన్ననయున్నమిన్న నెఱిగొప్పున నప్పుడ నేలవేల్పు గ
న్నన్నులఁదాల్చి కెందలిరు చందముఁ బొందఁగఁజాలు కేల్గవం
దిన్నఁగమోడ్చి లోఁ దనివితీఱని కూరిమిమేరమీఱఁగన్. 67

ఉ. మెండగువేడ్క డెందమున మీఱఁగఁ దమ్ముల కన్నదమ్ములై
దండిగనున్న మీయడుగుఁదమ్ముల కిమ్ముల మ్రొక్కఁగంటి మీ
యండనుజేరి మిమ్ముఁగొనియాడఁగఁగంటిని మంటి నేఁడుగా
పండువుమాకు మాకొదలువాసెను మీదగుకూర్మిపేరిమిన్. 68

గీ. అనిమిషఱియు నేమియో యపుడుగఁదలఁచి
సిగ్గుచేఁ బల్కఁజాలక చెలులవంకఁ
జూడఁగా నామెయుల్లంబు చొప్పెఱింగి
వారిలోపల మణిరేఖ పలికెనిట్లు. 69

గీ. పెల్లుగాచెడు పేరెండఁ బెంపుతఱిగి
కుందనమువంటి నెమ్మేను కందిపోవ
నెచ్చటెచ్చుటఁద్రిప్పంగ నిచ్చయిడెనొ
కటికితనమూని మీయుల్ల మిటులుమిమ్ము. 70

క. బడలిక యుడఁగఁగఁగొండొక
వడిమీరిచొచ్చుట నిలిచి పలుకుండొగి మీ
యొడయండెవ్వఁడొ మీరి
య్యెడకు న్విచ్చేసియుంట కెయ్యదికతమో. 71

వ. అనియమ్మగుడుం గొండొకవడి చిఱుముడిపాటున నెడఁదందలపోసి
యాతం డప్పడంతుల కిట్లని చెప్పం దొడంగె. 72

ఉ. మాద్వార యొప్పుఁ జెప్పఁదరమా మనకవ్వడి యాతఁ డారయం
బై దలివేడ్క మీఱ విను మానిక ముందలఁ దాల్చుదిట్టదా
గాదిలివేఁటకై యెఱుకుకై వడి నిప్పుడు వచ్చెఁ గాన కే
మాదట వెంటవచ్చితిమి య్యాయనచూడ్కికి విందుసేయుచున్. 73

చ. తపవులనుండి యేము ముదితా యతఁ డెచ్చటి కేగుచుండు వెం
బడిఁబడి వచ్చుటచ్చటికి వానయు నెండయు నాకవేడ్కతో
నడుచుచుఁ గొల్చుచున్న కతనం గడు నియ్యముచూపి నిచ్చలా
తఁ డెయెనఁ గుంజుమీఱ తనపుఁదానె మదిన్మము మెచ్చి యన్నియున్. 74

సీ. చెలియరో విను మేను జెప్పెదనంతయు
మొదల మాద్వార యొకపూనిక నెఱపఁ
దనమనికి వెలువడి తద్దయుఁ గోరిక
నందందుఁ గలవాఁకలరసి యరసి
యలతుమ్మెదలపాట లాలించి యాలించి
పొలయుక వింతలు చూచి చూచి
చెలువంపుఁ గోనలు తిలకించి తిలకించి
కన్నారఁ గొండలు కాంచి కాంచి
నెలలు పండ్రెండు పొలుపుగ నేలఁ దిరిగి
తనదుపూనిక నెఱవేర్చి చనఁ దలంచి
వెండియుచ్చోట నొకపూఁటయుండ మదిని
దలఁపుపుట్టిన నాఁగి నేఁ డెలమితోడ. 75

సీ. సరిమాలుమావుల దరిఁ గ్రాలుబావుల
విరిచాలుతావుల వేడ్క నొంది

ననమేటి చోటులఁ జనుమేటితేటుల
నునుదేటపాటలకును జెలంగి
మొనలేనివానలఁ బెనుపూనుకోనల
ననత్రేనెసోనలఁ దనివిగాంచి
వెలినున్న మొట్టలఁ గలనున్నచెట్టులఁ
బలువన్నెపిట్టల పొలుపుచూచి
యొయ్యనొయ్యన నడతేరు పయ్యెరలకు
డెందమునఁబొంగి యిచట నందందుఁగొంత
తడవుమాసామియును మేము వెడలలేక
వింతలెల్లను గనుచుంటి మింతులార. 76

గీ. అటులుచూచిన పిమ్మట నడవిలోన
వేఁటలాడఁగ నించుక వేడుకైన
నిలిచియీచేరువను వేఁట సలుప గడఁగి
విల్లుఁదమ్ములు చేనుల్లసిల్ల వెడలి. 77

శా. సింగంబుల్బెడిపాఱమిట్టి ములుకుల్సింగాణికిందార్చి వే
త్రుంగంజేయుచు బెట్టిదంపుఁ బులులం దూలించిచానేయుచుఁ
బెంగంజెల్లకుఁ ద్రొక్కుచో నెలుఁగులన్ బిట్టేయుచున్ లాఁగలం
గ్రుంగంజూచెడు పందిగుంపులతలల్ గూలంగఁబెల్లేయుచుఁ. 78

క. ఇక్కరణి నాతఁడింతకుఁ
బెక్కు మెకంబులనుబట్టి పెంపఱఁజేయుఁ
జిక్కక మెలుఁగొక్కటి యీ
చక్కిఁబఱచెఁ గోర్కులెదల సందడిసేయుఁ. 79

వ. దానింగానక కొంతతడవువెదకి వేసరి. 80

ఉ. చాటునమున్నచో నెలుఁగుజాడ గనుంగొననైన వచ్చి మీ
బోటి వలంతు లచ్చెరువు పొందఁగలోఁగొను నిచ్చమమ్ము ని

చ్చోటికిముందుగాఁ బనిచెఁ జొప్పుగనుంగొని రమ్మటంచు న
మ్మేటియు వచ్చెఁగర్జమిట మేలగుపల్కఁక వీనుసోఁకినన్. 81

క. ఇచ్చట కొమ్మలచెలువున
కిచ్చను గడుసంతసిల్లి యీకోనకునే
మచ్చికగవచ్చితిమీఁదగు
మచ్చిక నీయలరుఁగొమ్మ ఘూదొరకనుచున్. 82

వ. అని చేతిలో నొక పూఁగొమ్మ పట్టుకొని. 83

క. ఇక్కొమ్మపైఁ దలంపెద
నెక్కువగాఁ గల్గియుండు నింతిరొకనిన్
ముక్కంటి యుబ్బరంపడు
నిక్కముదాఁచంగనేల నీకుంననుమీఁ. 84

క. అని తెల్పివారి వెండియుఁ
గనుఁగొని యోఁకన్నెలార గారవమునమీఁ
ననఁబోఁడిఁ గన్నునుండియు
నెనరును వేడుకయు వెఱఁగు నెలకొనెమాకున్. 85

ఉ. ఈమురిపెంపుఁ బల్కులును నీనునుఁబాటల యొప్పిదంబు నీ
మోము చొకాటముంగనిన ముద్దియలార వినుండు వేయునిం
కేమిటికి వెలంది మదినెంచఁగఁ దామర చూలి రాణియో
యామె యొనర్చినట్టిజవరాలో యనంగను మాకుఁదోఁచెడున్. 86

క. తొయ్యలి ప్రోలెయ్యది పే
రెయ్యది యీచెలువఁదాల్ప నెన్నఁకఁగనెనో
యియ్యొలనాగం గడుపున
నెయ్యేకిమీఁదుగనెనొ యెఱిఁగింపుడుమాకున్. 87

వ. అనిన నతని జాణతనంబునకును నేరుపుమాటల పొంకంబునకును
డెందంబున నివ్వెఱపడి. 88

చ. పొసఁగఁగ లేమలొండొరుల మోములుగన్గొని కావిమోవులన్
ముసిముసినవ్వుపూన నొకముద్దియ నేర్పునఁ బల్కెఁ జియ్య యె
ద్దెసలను సామిచూపులకుఁ దెప్పరముండును నె యీనెలంత యిం
పెసగఁగ నల్వచెల్వయొనరించిన కన్నియయౌ నిజంబుగన్. 89

చ. అదియునుగాక మీరలిపుఁడన్నియు మీయెకిమీనిమన్ననన్
బదిలముగా నెఱుంగుదురు మావలనన్వినదగ్గ దేమియు
న్నది యటులైన మాయెడల నబ్రపుఁగూరిమి పెంపుచెందఁగా
నిది తుదముట్ట మావలననే విన వేడుకయైనఁ దెల్పెదన్. 90

గీ. పుడమి పువుబోఁడి కపరంజిముద్దు తొడవు
పాలమున్నీటిపట్టికిఁ బట్టుకొమ్మ
పెట్టుపోఁతలకెంతయుఁ బుట్టినిల్లు
వెలయు మణలూరనంగను వీడొకండు. 91

క. సిరికిం బుట్టినయిల్లయి
కరమలరెడు మానికంపుగమికిందావై
యిరవై ముత్యమ్ములకును
బురుడించును బాలసంద్రమును బ్రోలెపుడున్. 92

శా. అవ్వీడేలెడు చిత్రవాహనుఁడు నెయ్యంబొప్ప నెవ్వారల
న్నొవ్వంజేయక కప్పముల్గొనుచునుండున్నేలవిల్లందఁబో
నెవ్వేనిత్తురు మావులున్నిరులుఁ జెక్కేనుంగులుం దేరులున్
జివ్వాల్మానితమంతనే పెఱదొరల్ చేదోయి జోడింపుచున్. 93

క. దండమువెట్టుచు ననయము
దండిమగండలేసిపోని దండుగవేతే
దండేలమాకునీవే
దండని పెఱరాచపిండతనిఁ దగఁగొలుచున్. 94

గీ. మేరయెఱిఁగిచెప్పి మెప్పింతుననుకొన్న
నెలతేనియసపుఁ బాలవెల్లి
పలుకుఁజెలికిమిగులఁ దలమున్కలయినచో
నోరులుదాని నరయ నోపువారె. 95

గీ. అట్టియొకమీనికి ననుంగుఁబట్టియీమె
కనులయెదురనె కాన్పించు కతన వేఱె
యీమెచెలువంబు పొగడంగ నేలమాకుఁ
బలుకువెలఁదుక మెప్పునఁ గలిగెనీమె. 96

ఉ. ఏడను మీఱెఱుంగనివి యేవియు లేవటుగాన మీఁదనే
జాడల నెప్పుడెవ్వనిని జవ్వని నెట్టనఁ జెట్టవట్టునో
వేఁడెద నిక్కువంబు వినిపింపుఁడు కల్లలుపల్కరేని నా
తోడుసుమ్ఁడీ యటంచు మదితొట్రిలఁబల్కిన నవ్వి యిట్లనున్. 97

క. మేమరయఁగ మీవారము
కామే మమ్మింత వేఁడఁగా లాఁతులమే
లేమా లెస్సగఁజూచిన
మీమెలఁతుక యొక్కటియును మేమొకటియునే. 98

మ. చెలియా సందియమేలనీపడఁతుకంజేపట్టు వివ్వచ్చుఁడి
మ్ములనామాటలు నమ్మియుండు మిటుపైఁ బూబోఁడియుంగ్రీడి తా
మలరుందావియుఁ బోలెనొక్కటయి యొయ్యారంబుగా నుండఁ గ
న్నులనిండం గనువేడ్కయీచెలులకున్ గొన్నాళ్ళకేకల్గెడున్. 99

క. కన్నుల విల్గలవాఁడిం
కన్నులలో మేలుబంతియగు నీనవలా
కన్నుల తూపులుగా వే
గన్నులదొరపట్టి గెలువఁగలవాఁడుసుమీ. 100

క. నిలువెల్లఁ గనులుగలదొర
చెలువంపుఁ గొమారుఁ గల్వఁ జెచ్చెరమరుఁడున్
నిలువెల్లఁగనులుగల విలు
బలువడిఁ జేపట్టిసరగఁ బడఁతుక గూర్పన్. 101

వ. ఇంక మీకలికియు మీరును నూఱడియుండుఁడనిన మణిరేఖ యిట్లనియె. 102

ఉ. ఈరీతిపల్కఁ గల్కియన నెవ్వతె మేమన నెవ్వరయ్య మీ
వారముగామె యందఱము వారలవీరలనట్లు మమ్మనున్
వేఱుగఁజేయ మీకుఁదగునే యిది యిట్లను టెల్ల మాదెసన్
గూరిమికల్గు కైవడియె నూఱును మీకడ నింక నేటికిన్. 103

ఉ. జాలమికేల మాచెలి దెసం బొలివోవనికూర్మిపేర్మి మా
పాలిటి వేలుపన్నిటికి మాకిటుమిమ్మునె చూపిపోయె మా
చాలములెల్లఁదీఱె నిఁకజవ్వనిఁ బెండ్లికొమార్తెఁజేసి యీ
మేలొడఁగూర్పఁ బెట్టితిమి మీపయి నెట్టునుదప్పదింతయున్. 104

గీ. కొమ్మనాక్రీడికోడను గూర్పమాకు
నిపుడు మీకంటెఁ జుట్టంబు లెవరు లేరు
కావునను మీరలెల్లనఁ గలికికొఱకు
వేల్పు దొరపట్టి కడకేగి వెరవుమీఱ. 105

చ. కనికరమూని మాదొరకుఁ గన్వడి యీచెలియందుమున్నుగాఁ
గనిన కొమారు నీబలుకఁగాఁదగుగట్టిగనింక మీర లి
ప్పనిఁ బయిఁవేసికొందుమని పల్కక యించుక యున్నఁజాలు మా
మనవి నిజంబుచేకుఱిన మాడ్కిన నెమ్మదినమ్మియుండెదన్. 106

గీ. పదిగఁ గొనియాడ నేపాటివారమేము
మఱుఁగుఁజొచ్చితి మెల్లన మగువనింకఁ

దప్పులెన్నక మన్నింపఁదగదెయిట్టి
చేతిపనితీర్పఁ దమకెంత సేపుపట్టు. 107

సీ. ఏఁజేయువిన్నపం బీడేర్చననుగదా
యేకీడుమాట నాలింపఁదప్పు
నీకఁగ్రీడిఁ దనపట్టినియ్యా నీకొల్పినఁ
గన మెందు నాగుండెకుదిరియుండు
నామేలిమాట నాయమచెవివేయఁ గ
ల్గినఁగదా నెమ్మదివనటమానుఁ
బడఁతియాతని చెట్టఁబట్టఁ గాంచఁగనబ్బు
నాఁడుగాపండువు నాకుమిగుల
ననుచు మణిరేఖమఱియు నెయ్యమునఁబలుకఁ
బడఁతి జేనినెప్పుడు చెట్టవట్టునోయను
తమకమునఁ బల్కితినిగాని తమరుపలుకు
మాట ముంగొంగుబంగారు మాటమాకు. 108

గీ. అనిన నన్నెలవేలుపు కనులుమూసి
యపుడు లోనిచూపున నేదో యరయునట్లు
మదినిదలపోసి కనువిచ్చి మగువలార
మేముదపసులమయ్యును మీకుఁగాను. 109

క. తడయక కవ్వడికడకున్
వడిఁబోవఁగ నొప్పుకొన్న వారమువల మా
రొయడయఁడును వేచియుండును
బడఁతీపోదుమని సెలవువడయుచునరిగెన్. 110

వ. అంత నక్కడఁ గవ్వడియును. 111

గీ. ఇచటనున్నట్టులేతన్ను నెంచుమనుచుఁ
జెప్పి సంగడి కాఁడెంత సేపాయయ్యెఁ

బోయిరాఁడాయె నిదె చాలప్రొద్దుపోయె
నచటఁబోయిన పనియేమొ యడ్డఁబోలు. 112

గీ. అనుచుఁ దలఁచుచు నవ్వాలనరుగుదెంచు
నెచ్చెలిమిఠాని దవ్వుల నెమ్మిఁగాంచి
యెదురుచని చెప్పనంత కోర్పిదను లేక
చనినపని కాయమో పండొయనుచు నడుగ. 113

గీ. ఏనుబోయినపని గాయయేలయగును
బనిని పండించుకొనియె నేవచ్చినాఁడ
నిన్ను మున్నట్లు వీడ్కొని నేనుగదలి
తొలుతఁ గారుకోనలుదాఁటి తోఁటఁజొచ్చి. 114

క. ఎలజవ్వనముం దొలఁకఁగఁ
దొలుకారుమెఱుంగులట్టి తొడవులుగల యా
బలు సింగారంపు నెలం
తలలోపలఁ గూరుచున్న నాతుకఁ గంటిన్. 115

వ. ఆచక్కెరబొమ్మ చక్కదనమ్మెక్కించుక వక్కాణించెదఁ జక్కఁగా వినుము. 116

సీ. బయలరిక్కలచాలు పాఱవైచినయెగ్గు
మలలనెల్లను జట్టుపఱచుసేగి
పవడంబులను బ్రామానుపడఁగఁ జేసినకీడు
సింగంబునడవిపాల్సేయురవ్వ
చందురులోఁగందు పొందించునారడి
చిగురులఁగఱుగాఁ జేయుకొదవ
నెత్తమ్ములను లోఁతునీటవైచినరట్టుఁ
బసిఁడికిఁ దావిఁగూర్పనికొఱంత

కలికిగోరులు సిబ్బెంపుగబ్బిగుబ్బ
లలఁతి మోవియు ననదుఁగౌ నలరుమోము
గొనబుచేతులు తెలిగన్ను లొనరుమేను
జేసినె త్తమ్మిచూలి ప్రోఁజేసికొనియె. 117

గీ. ఈడు కలిగించియును బువ్వుబోఁడికీడు
కలుగకుండఁగ నొనరించె నలువయౌర
తలఁచిచూచిన నేదియో తమ్మిచూలి
టక్కుగావింపఁగాఁబోలు నిక్కముగను. 118

గీ. నలువ తమ్ములఁ గల్వలఁ జెలువుమీఱఁ
జేసి యవి రేయుఁబవలును జెన్నులేని
వాటపొడగాంచి యీరెంటి నేటఁగలిపి
కలికికన్నుల ననయంబు వెలుఁగఁజేసె. 119

గీ. నేలపై నంటులుంట యేమేలివింత
యనుచు మదినెంచి వింతసేయఁగఁదలంచి
నలువ యనఁటులపై నేలకలుగఁజేసె
నెలఁత తొడలును మొలయునన్ నెపమువెట్టి. 120

ఉ. మించులఁ గెంపుల న్నెలను మేలియనంటులఁగూర్చి నల్వమై
మించును వాతెఱ న్మొగము మేల్తొడలుం దగఁజేసి వానిలో
నించినతళ్కునున్ బిగియు నీలియు నాకును దీసిచూపులున్
బించపుఁ గుబ్బలుం దుఱుము వీపు నొనర్పఁగఁబోలునింతికిన్. 121

చ. అలతలకట్టు లింతితఱు లన్ను కనుల్బెదుదల్వాలంది చె
న్నలరెడు బొడ్డువట్రుసుడి నాతుకసైకపుఁగొనునున్న బం
తులు ననబోఁడి చన్నుఁగవ దొంతిగవిద్దెలు రూపుపూని యీ
మెలఁత నెపంబునం బుడమిమీఁదను గ్రుమ్మరుచున్నవారయా. 122

గీ. నేరె టేటి యసట మించు నిగ్గమర్చి
నాతిచెలువంబుఁ జేయుచోఁ దాతకాన
మగువనెన్నడు మొనరింప మఱచిపోయె
ముదిమివచ్చినతఱి నెట్లు మదులునిలుచు. 123

క. చన్నుంగవ యందముఁగను
చన్నుంగవయుం దలంతు వటనీవున్న౯
నెన్నడుమును గనితలఁచితి
నెన్నఁడు మునుగనియెఱుంగ మీాయసదనుచు౯. 124

గీ. కలిమి కొండంతకన్నను గరముఁగలిగి
ఱాయిగానుండె బిగిగుబ్బ దోయిచూడ
మెండు నెత్తమ్మిమొగ్గల నిండియుండి
గొప్ప మొసలిచేరిన మేటికొలఁకుఁబోలి. 125

క. పలువరుసలల్ల మల్లెల
పలువరుసలనంగవచ్చుఁ బైదలి చెలిక
త్తైల వగచూపు తెగలు క
ల్వాలవగచూపు తెగలనఁగవచ్చును తేఁడా. 126

గీ. అనిమఱియుఁ జెప్పఁబోవఁగ నతఁడు చెప్పు
మాటకడ్డంబువచ్చి యమ్మేటితేఁడు
నిట్టలంబగు తమకంబుపట్టలేక
తనదు సంగడికానితో ననియెనిట్లు 127

చ. పొదలెడు వేడ్క నీవిపుడుపోయిన కర్జముమాటమాని నీ
కొదుఁగనిచేతఁగాని పనియొక్కటి పైనిడుకొంచు నేమియో
చదివితివింతసేపు నికఁజాలుఁబొగడ్తలు కట్టిపెట్టి యిం
పొదవఁగఁ దొత్తఁదెల్పు ననునుగ్మలికై కొన నిచ్చగించుటల్. 128

చ. అను చెలికానితత్తరము నంతయుఁ గన్గొనితాను ఱేని వీ
డ్కొని యటుపోవుటల్ మొదలుగఁబ్బైతలుండిన పూవుఁదోఁటకుం
జని పలుకాడుటల్తుదిగఁ జక్కఁగనంతయు విన్నవించియో
య్యన జెలికత్తియల్ పలికినట్టి తెఱంగెఱిఁగించి యిట్లనున్. 129

గీ. నిన్ను వేఁడెద మన్నించి నన్నొకింత
పలుకు చెవిఁబెట్టి యాకన్నెవలన నీవు
మున్ను గన్న కొమారుని వన్నెమీఱ
నెలమి మామకుఁ బెంపుగ నియ్యవలయు. 130

గీ. ఇంతవట్టును జనువిప్పుడిత్తువేని
కొమ్మ తప్పకిప్పుడు నీదుసొమ్మెసుమ్మ
నేనుజెప్పితినని వెన్క నేరమిడక
యిపుడ ముందుగఁ జక్కఁగ నెంచుకొమ్మ. 131

ఉ. ఏలతలంప వేపలుకు లించుక దేవరయానతిచ్చినం
జాలును నేలఱేని సరసం దగ నేలినవారికర్జమున్
పీలుగ మాటవెంబడిని విన్నపమానఁజేసి వేర్లిమ్మడిన్
మేలొనగూర్చి వత్తునను మెచ్చఁగ నిప్పుడ పోయివచ్చెదన్. 132

వ. అనిన గారవంబున విశారదున కానేలఱేఁడిట్లనియె. 133

క. సతమును గోరికలూరఁగ
నతివఁగవయ నెప్పుడెప్పు డనుచుండఁగ నిం
తతడవు జెప్పఁగ నేటికి
బతిమాలఁగ నేఁడు క్రొత్తవాఁడనె నీకున్. 134

చ. పలుకులిఁకేల నీపనువుపన్నుగఁ జేసెద నెన్నఁడైన నీ
పలుకున కడ్డమాడుదునె పట్టినొసంగెద ఱేపెపోయి యా
పొలఁతుక కన్నతండ్రికడ ముచ్చటలాడుము మేలునెంచి నీ
కెలమి నిఁకేమియిచ్చినను నించుకయేనియు నప్పుదీఱునే. 85

గీ. అనుచుఁ గొనియాడి చెలికాని, జనువుమీఱ
మగువపలికిన పలుకులు మఱియుమఱియు
నడిగి విన్నవించు నెయ్యంబుమిగుల
వేడ్కపడుచుండెఁ గవ్వడి విసుగులేక. 136

వ. అనినఁ దరువాతికత చెప్పుమని జనమేజయుం డడుగుటయు. 137

నిరోష్ఠ్యకందము. రక్కసిఱేఁడ్లఁగలనన్
జక్కడఁచి యలతెఱగంట్ల సాఁకెడిదిట్టా
చక్కఁగ నెల్లరసేగిం
జిక్కఁగనియ్యక యరసెడిజేజేరాయా. 138

ఉత్సాహ. చుట్టువాలు కేలఁబూని చూడునిన్నుఁ జంపి చే
పట్టువాఁడఁ గ్రీడినంచుఁ బన్ని తేరుడిగ్గి వే
కట్టుపట్టి విన్నవాఁకఁ బట్టిమీఁది కేగుచోఁ
జట్టికీడి వెన్కకీడ్వ బాఁగమీఱువేలుపా. 139

గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన
నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందుకూరి
వంశ పయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్య
పుత్ర సుజనవిధేయ వీరేశలింగ నామధేయప్రణీతంబయిన
రసిక జనమనోరంజనం బను ప్రబంధరత్నము
నందుఁ దృతీయాశ్వాసము.

---

# రసికజనమనోరంజనము

## చతుర్థాశ్వాసము

క. సిరిపడఁతి యెడఁదనెప్పుడుఁ
గరమలరఁగ గొల్చువారిఁ గడుఁగూరిమితో
నరయుచు నెల్ల జగమ్ముల
వెరవారఁగ బ్రోచుచుండు వేల్పులవేల్పు. 1

వ. వైశంపాయనుం డటమీఁద నడచినకత జనమేజయున కిట్లని చెప్పం దొడంగె నట్లా బూటకంపు నేలవేలుపు నూటిగామాటలాడి యాచేడియలన్వీడ్కొని క్రీడికడకు న్వేడుకమెయిం జనిన వెనుక నమ్మచ్చెకంటి తమకంబు హెచ్చిపెచ్చు పెరిగెడి మరుచిచ్చున వ్రేఁగంజొచ్చిన నెచ్చెలులెల్ల బెల్లుగఁ దల్లడిల్లి యుల్లంబులోని యారటంబు దీఱనూఱడింపుచుండ. 2

క. పడమటిమల కలుగులలో
నడఁగిన యిరులను గడంక నవలికిఁ దఱుమన్
వెడలెడి వడువున నడిచెను
బడమటికొండకును బ్రొద్దువడిఁ గెంపడరన్. 3

చ. అదనదితప్పి వేఁడివెలుఁగ త్తమిలన్ దడమెత్తుపాముగా
ముదొరవినంపుమంటలనఁ బొల్పగుఁ బశ్చిమసంజకావి, పైఁ
గుదిరిన సందెచీఁకటి తగుంబొగయట్లు, చెలంగు నల్లత్రాఁ
చుదడములట్ల చీఁకటులు, చుక్కలొగిం దలమానికంబులో. 4

గీ. గొండ్లిసలిపెడి యురవడి గుబ్బలల్లు
జడలగుంపులుపీడి యీపుడమి నెల్ల
నలముకొనియె ననంగను నలుపుమిగిలి
కటికిచీఁకటి యెల్లెడఁ గ్రమ్ముకొనియె.

చ. అలరెడు రేవెలంది చెలువారఁగఁదాల్చిన కావిరంగుదు
వ్వాలువవదల్చి చందురని వావిరిఁబొందఁగఁగోరి మల్లెమొ
గ్గలుగల నీలిచీర మెయిఁ గట్టెననంగనుజూడనొప్పెఁ జు
క్కలగమితోడఁ జీఁకటులు కన్నులపండువుగాఁగ నయ్యెడన్. 6

ఉ. గొంకులుదూఱుచున్వడలి గోడలుదూఁకుచుఁ బొంచిపొంచి బల్
సందడిగాకయుండఁ జిఱుసందులవెంబడిఁ దావుఁజేరుచున్
సందియమంద కాఱడికి సైఁచుచు సాముల మోసపుచ్చుచుం
జెందిరి కోరుకోరికలఁ జేరిబొజుంగులు దొంగలుందగన్. 7

గీ. తమ్ములకు దాయయౌతేఁడు తాజగమ్ము
నందుఁ జొచ్చియుంటకుఁగాను ముందుపంపి
నట్టి తెలిగుడారమనంగ నమరెఁ దూర్పు
దెసను దెలివన్నె కలువలు తెల్వినొంద. 8

ఉ. చుక్కలతేఁడు చీఁకటులసూడు వెలుంగులతేని జోడు బల్
జక్కవపుల్గుమొత్తముల సారెకునేచెడువాఁడు చక్కనౌ
మిక్కిలి కంటిదేవరకు మేల్నగయై తగువాఁడు కల్వలన్
మక్కువఁ బ్రోచుతేఁడు మరుమామ కనంబడెఁ దూర్పుకొండపైన్. 9

చ. తఱియను వేటకాఁ డిరులదండను కోయిలగుంపుఁబట్టఁగాఁ
బఱిచి వలన్నిగిడ్చె ననఁ బర్వెను దూర్పునఁదెల్పు, గోఁజిగు
ళ్ళెఱకయి పెట్టినట్టు నెలయింపగుఁ, బడ్డపులుంగనంగళం
కొఱపగుఁ, గాంచి పర్విడెడు నోయనఁగోయిల లేగుఁజీఁకటుల్. 10

చ. కొమరువెలుంగు రేవెలఁది కొప్పనఁజీఁకటి, కొప్పుపూలునా
నమరును జిక్కచాల్, నెలమొయూరపు రాగిడిబిళ్ళయట్లుగున్,
సమకొనుకందు లోనిడిన నల్లనిటాయన నొప్పు, రాగిడిన్
శిగఁ జుట్టుమల్లెలనఁ జందురుచుట్టుచు దెల్పుగన్పడెన్. 11

గీ. తమిసిరేవెలంది యిడుగందంబు మేనఁ
దాఁజలువల తేఁడప్పుడు తాల్చెననఁగఁ
దెల్లనయ్యెను జందురుండల్లనల్ల
నెల్లకడలను వెన్నెల లల్లుకొనియె. 12

సీ. నెఱతావులుచెలంగ నిండారవిరిసిన
మల్లెపూవులతోడ వెల్లివిరిసి
కప్పురపుటనంటి విప్పఁబూరలరాలు
కప్రంపుఁబొడితోడఁ గలసిమెలసి
కమ్మవిల్తునిదాయ కాపురంబై తగు
వెలిమలజిగితోడ వియ్యమంది
కటివేల్పునిల్లాలిఁ గసిపెంపుగాంచిన
పాలమున్నీటితో మేలమాడి
మెండికొనియుండె బువినిండ వెండికొండ
కొండపిండులఁ జెండాడు దండిహత్తి
పిండికలకండ వెలఁదమ్మి దండఁదెగడి
పండు రేయెండదండులు నిండఁజిగిని. 13

వ. అత్తఱి నాబిత్తరి చెలికత్తెలతోడ నత్తోఁటలోనుండి నిండికొన్న పండు
వెన్నెల తెగల సెగలకుం దాళంజాలక. 14

ఉ. చెందొవవిందు దండడీనిఁ జిందఱవందఱ చెందికుందఁగాఁ
జందురుదిందఁ, గొందలముచెందఁగ డెందము కందుఁదండపుం
గొందలిరుం దగందొడుగఁ, గ్రిందుపడందగు పొందికందొగల్
సందడిచిందఁ దుంటుడుకు చందముఁబొంది వెలందివందురున్. 15

ఉ. నెయ్యపుటొజ్జ లోఁగఱపి నిచ్చలునూల్కొలుపంగ నోరె మొ
య్యొయ్యన సన్నగించి మదినొంటిగనల్ల జగంబుచుట్టమున్

నెయ్యమునం దలంపుచును నిల్చినవన్నియు మూఁగఁగా నతం
డయ్యెడ ప్రేమఁ గన్పడెనొ యాఁడియు వ్రాలెను గన్నుమూయుచున్. 16

వ. ఇట్లాతండు తనకన్నుల ప్రేమలసిలిచినట్లయిన మదికలంగి యచ్చెలువ
యొక్క నెచ్చెలితో నిట్లనియె. 17

ఉ. వీఁడుగదమ్మ నావలపు వీటిఁడిచేసినవాఁడు, పొన్నపూ
వీడుగదమ్మ లోఁతయిన యీతసిపొక్కిలి కింకనావెతల్
వీఁడుగదమ్మ నన్నిపుడు వేయెదఁజేర్చిన నీతఁడున్నయా
వీడుగదమ్మ నేలఁగల వీడులఁగోపల మేటి బోటిరో. 18

వ. అని పచ్చవిల్తుని నెఱచిచ్చునం గ్రాఁగుచు మఱియుం బలవింపం
జొచ్చిన నెచ్చెలులు చలువపనులు సేయందలంచి. 19

సీ. చేడియయడుగులఁ జిగురాకులుంచిరి
యింతిచన్నులఁబూవుబంతులిడిరి
పొలఁతితొడల నంటిపొరలనంటించిరి
ముగుదపొక్కిటఁ బొన్నపూవునిడిరి
యువిదవాల్గన్నులఁ దొవరేకులద్దిరి
చానకెమ్మోవిఁ బూఁదేని యిడిరి
తొయ్యలిచేదోయిఁ దూండ్లనుబెనఁచిరి
కొమ్మకేల్గవ విరిదమ్ములిడిరి
యతివ యడుగులోనగు వానికవ్విసాటి
కావొ సరియౌనొ యని చూచుకరణిఁజెలువ
చెలులు కావించిరొక్కటఁ జలువపనులు
వానివానిని బోలినవానిఁగూర్చి. 20

వ. అంత నొక్క ప్రోడచేడియ వారలంజూచి 21

సీ. మరుచిచ్చుదరికొని మండెడు నెమ్మేన
వీవనల్చేఁబూని విసరవలదు

కంటికాటుక నీటఁగందైన చెక్కుట
ద్దంబుల గందంబుదార్పవలదు
వలపుచీఁకటి బెంపువాసిన తుఱుముతేఁ
టులసంపెగల్చుట్టఁ దలఁపవలదు
బలువిరాళంపుఁగాఁకలఁ గందు చనునిమ్మ
పండులఁ గప్పూరం బలఁదవలదు
దెసల నెల్లను బర్వుచు దిటముచెంది
పిక్కటిల్లుచు వెలుఁగొందు చుక్కలదొర
కాయు వేఁడివెన్నెలలంకుఁ గలుకులార
పెట్టవలదు తామరకంటిఁ బెంపుమీఱ. 22

వ. అని యాచిత్రాంగదవంకం దిరిగి. 23

సీ. కైదమ్మి మోముచుక్కలరేని సెగఁగందం
జెక్కునఁజెయ్యేలఁ జేర్చెదమ్మ
జాఱొక్కప్పుచీఁకటిఁ జనుజక్కవలుగుందఁ
జానరో కుఱులేల జార్చెదమ్మ
నునుముక్కు సంపెఁగ నూగారుతుమ్మెదల్
బడలంగ మోమేల వాంచెదమ్మ
మినుకుకాటుకనీట నునుఁజెక్కుటద్దముల్
మాయఁగన్నీ రేల పఱపెదమ్మ
చేయి దామరచెక్కునఁ దీయవమ్మ
ముంగురుల్ జాఱనీకమ్మ మోముమీఁది
కెత్తవమ్మ కన్నుఁగవ నీరొత్తవమ్మ
పలుకువినవమ్మ లేవమ్మ పసిఁడిబొమ్మ. 24

గీ. గట్టువిలుకానినైనను గడియలోన। క్రిందుపఱుపంగఁజాలిన క్రీడియంత
వానికిని దుంటవిలుకాని బారిపడఁగ।నీకనివుఁగా చుటొకబరువేనెలంత.

గీ. నేటరేపట నిఁకమున నేలవేల్పు
మన్ననను జక్కఁబడునన్ని మానువెతల
ననుచు ననబోఁడిఁ గడువేఁడి యందువలన
నూఱట యొకింతగాన కయువిదమిన్న. 26

వ. తోడి చేడియలతోడ. 27

క. మునుకొని మరుఁడీకైవడి
ననబోఁడి మెఱుంగుఁ జనుల నడుమని పెకలం
జనకుండ గుఱిగనేయుట
గనవింటికె కన్నులుండఁ గాఁబోలుఁజుఁడీ. 28

ఉ. చేతులు తమ్మితూండ్లనుచుఁ జేరినయంచలు కొప్పుజూచి వే
బీతున నల్లమబ్బనుచు వెజ్జనఁ, బంచిన గాలినాఁడు పా
మే తఱుమంగఁ బువ్విలుతుఁడేమిటఁ జామను గెల్వలేమిఁ ద
ర్వాత నెమళ్ళఁగూర్చెఁ బగవానికొమారుని వారువంబులన్. 29

వ. అనిచెప్పి యప్పుడు చెవులుచిల్లులువడఁ గడుఁగూయు కోయిలలు
మొదలయిన వానింగూర్చి పేర్చిన కినుక పెంపున నిట్లనియె. 30

సీ. ఒరులపంచలఁజేరి యున్నట్టికోయిలా
యెందుకునీకింత యెరిగిపాటు
నిలువఁజోటునులేక నింగిప్రేలెడు చంద
మామ నీకేలద్రిమ్మరితనంబు
చచ్చిచావనివాని చాడ్పుననున్నట్టి
మరుఁడనీకేటి కీమండిపాటు
కదిసికొమ్మలపాల బ్రదుకఁగాంచిన తుమ్మె
దా యేల నీకింతయదరిపాటు
మీకుమునుబోలె నిపుడు మామెలతతోడిఁ
యొక్కమాటనుంటయును మోమోటమియును

లోని చుట్టఱికంబును జానుమీఱు
చూపుచెలికారమును గొంతచూడవలదె. 31

క. కలువలదొర యల్లుఁడవై
కలువలె తూపులుగఁ దాల్చు కరములరేడు నీ
కలుకమెయి నక్కటకటా
యళుకొందిన కలువకంటి నలఁచుటతగునే. 32

వ. అని మంచిమాటల నెంతవిన్నవించిన నించువిల్కానివలన నించు
కంతయు నక్కటికంబుగానక కటకటంబడి పడంతియా వెసవిల్లునిట్లు
దూఱందొడంగె. 33

ఉ. ఒజ్జలకాపురంబు మొదలూడఁగద్రొబ్బిన రేయిద్రిమ్మరిన్
బజ్జను జేర్చికొంటివఁట ప్రగ్గసగాఁగను గన్నతల్లులన్
విజ్జనవీడనాడి చెడి వేఁబలుగాకులఁ గూడుపుట్టు గు
డ్లిజ్జగమందు నీకుదడమేయఁట యింతులదోసమెట్టిదో. 34

గీ. చేతఁ జెఱుకువిల్లొక్కటి చిక్కఁబట్టి
కంటఁబడకుండఁ బూఁదూపుగములు నాటు
దేల నికమీఁదఁ దూపులు నేలఁగలియఁ
బీల్చినీవిల్లు వేళ్మిడిఁ బిప్పియిడుదు. 35

గీ. తోడఁబుట్టినదనియైనఁ జూడకెపుడు
నీకు తల్లియిల్సిరిగూల్చి నీదుపగతు
కడనుదలమానికంబయి గరువపడెడు
నెలను జెలిఁజేసికొంటచేఁ దులువవీవు. 36

గీ. అని మరు మఱియుదూఱఁగ నతివయొకత్తె
కంటఁబడకుండు మరునేలకఱకులాడ
మింటఁగడుమండు నెల చానమేనుగాఁడ
ననుచుమరలింపఁ జందురుఁగనుచుఁ బలికె. 37

గీ. ఒకటి రెండునాఁడులు చెల్లియున్ననాఁడె
చూడరాదని నినుఁ బెద్దలాడుచుండ
బెద్దవాఁడవై మిన్నంది మెలఁగునిన్ను
జనులకుఁ జూడవచ్చునే చందమామ. 38

గీ. తమ్మికంటియటంచు మాతలిరుబోఁడి
నలుకమెయినలంచెదవేమి యట్టుకాదు
కలువకంటియెసుమ్ము మాకలికిమిన్న
కసికరముచూపి కావుమో కలువతేఁడ. 39

చ. సిరికిని దోడఁబుట్టువయి చెన్నుగ వెన్నునకు న్మఱందివై
యరపదిమోములున్నదొర కౌదలనందపు మానికంబవై
మరునకు మేనమామవయి మన్నన నత్రికి ముద్దుపట్టివై
కరమలరారు నీకిటులు కల్కులనేఁచి కలంచఁబాడియే. 40

చ. ఒరులకుఁజేరదవ్వగుచు నొజ్జలకొంపనుదీసి తమ్ములం
గరము బడల్పడంబఱపి కాంచినతండ్రికిఁ బోటుతెచ్చి వం
కరతనమల్ల చిన్నపుడె కాంచి కరంబునునీవు రేయిత్రి
మ్మరివని పేరుపొంది యిఁక మన్ననఁజూతువె యాఁడువారలన్. 41

మ. కడలిన్వార్వపు టగ్గితోఁబొడమి వీఁకన్మిత్తి వేవెల్గు నె
క్కుడుకాఁకంగడువాఁడిమిన్నిలనెలం గూడందగంజాలి యె
ప్పుడుఁ బెన్సప్పపు గాముకోఱల విసంపుంజిచ్చుకున్ సైఁచి యీ
పుడమిన్మిన్నులుముట్టు నీకుఁ జలువల్ పుట్టంగ నెట్లబ్బెడున్. 42

సీ. నీదువెలుంగులు నెఱకాఁకలాటను
జాలనీరగు నెఱజాలె తెలుపు
నీనడతకరంబు నీతంబు తప్పుట
నువిదఁగోల్పడిన నీయొజ్జతెలుపు

నీదు వెన్నెలగముల్ నెఱవాఁడులౌటను
దలవాల్పు తమ్మిమొత్తములె తెలుపు
నీరూపు చూపఱకోరువరాకుంటఁ
గవవిడిమేగు జక్కవలె తెలుపు
సిట్టినీవలనను మేల్మి యెట్లుగలుగు
సరిగనీరూపు నానాఁట సన్నగించి
పిదపఁ బదియాఱువ్రయ్యలై పెద్దపాము
నిన్నుమ్రింగిన నెలఁతల నగులుదీఱు. 43

వ. అని చందురుం దూఱి యుల్లంబు జల్లన మెల్లన మేనెల్లఁ జల్లులువోవఁ
బెల్లువీచు చల్లగాడ్పుఁగూర్చి యల్లన నిట్లనియె. 44

గీ. లేడికన్నులుగలది యీ లేమమిన్న
లేడి నెక్కుచుఁ దిరిగెదువాఁడవీవు
నిట్టి చుట్టఱికంబుండ నింతి నేచఁ
దగునె తనకీవె యుసురని తలఁచియుండ. 45

చ. జగమునకీవు కీడు గడుసల్పెదువంచును దమ్మిచూలి నె
వ్వగనిను నొక్కమూలఁ బడవైచెను దానవడంగకున్న నిన్
దగమెసవంగఁ బాములకు నాల్కలు రెండొనరించి వానికిన్
జగమున వేయియేఁడులుమనన్ బ్రదుకిచ్చెనుగాదె పయ్యెరా. 46

వ. అని మెల్లమెడలఁ బిక్కటిల్లి యిక్కటంబుగాఁ బెక్కువగలఁ జెవులు
వగుల నఱచుచుండు గండుఁ గోయిలలు లోనగువానింగూర్చి
యిట్లనియె. 47

సీ. కొమ్మలనదలించు కూళపయ్యెరపిన్న
చలపట్టినిన్నుఁ బాములు మెసంగ
కాకిమూఁకలలోనఁ గలసిమెలంగుచు
గేరుకోవెల నీదు నోరుపడను

పంక్లుకొఱుకుచు నిల్వక యెగసిపడెడు
చిలుకనీబ్రతుకెల్లఁ జెల్లఁగలయు
పురుటంటిబూచులపోల్కి నివ్వెఱగొల్పు
తుమ్మెదానీత్రుళ్ళు తుప్పలెక్క
గంతులిడుచును దెరువర్లఁ గలఁచుచుండు
నెమ్మి నీయాటలెల్లను నేలఁబడను
నీళ్ళు నములుచు మగువల నెగులుపఱచి
నిక్కరాయంచ నీతిండినీరుగాను. 48

వ. ఇట్లు దూఱుచుండ. 49

ఉ. పిట్టలుగూసెఁ జీఁకటుల పెంపెడఁబాసె మెఱుంగు రిక్కచాల్
బిట్టుగమాసె జక్కవలు వేడుకనొండొరుడాసెఁ గల్వతె
ప్పట్టునఁ దెల్వివాసె వెతవాసిన తమ్ములుపొంగి తేంట్లకున్
నెట్టనవిందుచేసె విలునేర్పునమాసె మరుండువేఁకువన్. 50

గీ. వెచ్చకాండ్రమదుల వేడుకడిందంగ
పాఱులలరి పగటిపనులకడర
వడిగఁగాఁపువారు పనిపాటలకుఁబోవ
తూర్పు కొండమీఁదఁ దోఁచెఁబ్రొద్దు. 51

ఉ. క్రిందటినాఁడె యట్లరిగి క్రీడిపయింగడువాలుఁగంటికిన్
డెందము చిక్కియుంటయును డీల్పడి పెన్వలవంతనింతిడాఁ
గుందుచునుంటఁ గ్రీడి యిటకుం బనిమీఁదను వచ్చియుంటయున్
గుందునఁ జిత్రవాహనునకుం దగఁ దెల్పెను జిల్కలర్మిలిన్. 52

చ. తెలిపినఁగొంత సేపు మదిఁదేఁకువదూలియుఁ దెల్విఁగాంచుచున్
మెలపునఁ గ్రీడియల్లుఁడగు మేలిపుడే యొడఁగూడఁ జేసికో
వలెనని యెంచి ప్రగ్గడలఁబంచెను గవ్వడిపాలి కప్పుడే
వలసిన మాటలంగఱపి వారిని వీటికిఁదోడితేరఁగన్. 53

క. తగువారల వెంటంగొని
ప్రగడలుచని క్రీడిఁగాంచి వరుసగఁ బలుకం
దగుపలుకులాడి విందుగ
నగరికి విచ్చేయ వేఁడ నగుచునతండున్. 54

క. గారవమునఁ దమ్ముండౌర
వారటుప్రగ్గడలఁబంచి వాసిగఁ బిలువం
గారాకుండుట తగదని
కూరిమి నేనుంగునెక్కి గొబ్బునఁగదలెన్. 55

గీ. అమ్మ యేనుఁగుపై నెక్కి యర్జునుండు
రాచనగరికిఁ బోవుచోఁ జూచువారు
వేయికన్నుల వేలుపు బిడ్డఁజూడ
వేయికన్నులైవలెనంచు వింతపడిరి. 56

గీ. పొడుపుఁగొండమీఁదఁ బ్రొద్దువెగ్గెడునట్లు
వెలుఁగుచతఁడు వీట వెడలునపుడు
మెలఁతుకలపరంజి మేడలపయినుండి
యలరువానగురిసి రతనిమీఁద. 57

గీ. క్రీడి వేంచేయుచున్నట్టి జాడ తెలిసి
వడిగఁ దగువారితోఁ జిత్రవాహనుండు
గారుపై నెక్కి యెదురేగి గారవమునఁ
దోడుకొనితెచ్చి విడిదిలో దొరనునిలిపె. 58

గీ. విడిది చేరినపిమ్మట వేడ్కమీఱ
నేకతపుటిల్లుచొచ్చి వారిరువురింత
మంతనంబున నేమేమొ మాటలాడి
మొగుడెంచిరి నవ్వొకొం చివలకపుడు. 59

వ. అంతనంతసంబునఁ జిత్రవాహనుండు తగుపోఁడిమిఁ గ్రీడినివీడుకొని తనయింటికిన్వచ్చి పెద్దలంజెచ్చెరరావించి పెండ్లికిదగిన మంచిమూరుతంబు పెట్టుఁడని కట్టడయిడి యూరుగై సేయఁ జాటంబంచిన. 60

సీ. కస్తురిపన్నీటఁ గలయంపిచల్లించి
గోడలుజవ్వాజి తోడనలికి
ముగ్గులుకట్టాణి ముత్తియంబులఁ బెట్టి
నెలతాల్తోడఁ దిన్నియలువైచి
డంబైన పగడంపుఁ గంబముల్నాటించి
తెల్లక్రొవ్విరులఁ బందిళ్ళువేసి
తోరంపుఁబచ్చలఁ దోరణంబులుగట్టి
రతనంపుదివ్వెలు జతనుపఱచి
కలయబంగరుపని మేలుకట్లుకట్టి
వాడవాడల పటాంబట్టు పడగలెత్తి
తావులమెఱుంగుఁ గురువేళ్ళ దడులుకట్టి
వీడుకై సేసి రెలమినవ్వీటివారు. 61

గీ. పెండ్లిపనులెల్లఁ జేయించి పేర్మితోడఁ
జుట్టములనెల్ల రావించిసొబగుమీఱ
విడిదిలోవలసినవన్ని వెసనమర్చి
లగనమిదెడాసెనని ఱేఁడు తగఁగఁబలుక.

క. తలయంటుకొనఁగఁ దఱియని 62
చెలియొక్కతె క్రీడితోడఁ జిలుకయెలుంగుం
గలకలమనినగు జిలిబిలి
పలుకుల వలపొలయ విన్నపంబొనరింపన్. 63

క. ఇదెవత్తు మీవుపదమని । కదలి యనుఁగుఁ జెలిగాని కైదండం బెం
పొదవఁగఁగొని వివ్వచ్చుఁడు । కదిసెంజలకంబులాడు గరుడలచవికెన్.

వ. అట్లు కదిసియచ్చట నెచ్చెలిమికానితో ముచ్చటలాడుచుండ. 65

చ. పలుకులలాగు నెమ్మొగము బాగును మీసము నూగు నొక్కసై
యలరుటకోర్తు యుబ్బపడి యప్పటి పాటునిఁగా నెఱింగి నె
చ్చెలిగమిఁజేరిచెప్పె మనచెంగటముఁగ బుపుదోఁటనేగిమిం
బలికినయల్ల బూటకపు మాటలమూట యితండెయంచటఁ. 66

క. తనగుట్టు బయలఁబెట్టక। పనిచేయఁగ నొడయఁడెంత వడిగలవాఁడే
ననబోఁడి గుట్టరయ నీ। యన సింగారించి పంచెనని నగిరిచెలుల్. 67

ఉ. ఆమెడ నింతిమోర్తు మదినాఁగకకోర్కులు క్రేళ్ళుదాఁట నే
మోయనఁబోవు నెచ్చెలిని మోవిపయిం జిఱునవ్వు మొల్కలే
పై యిగురొత్త గన్నయిగ నల్లనమానిచి జాఱుపైఁటఁజం
దోయికిఁ దార్చుచుంబలికెఁ దొంగలిఱెప్పల నొప్పలీనఁగన్. 68

గీ. మేలుగూర్చినవారికి మేలెకలుగుఁ
గావునను మనమీజన్నిగట్టు నిపుడు
తోడఁబెండ్లికొడుకఁజేయఁ దొడరవలయు
మనువుకూర్చినపనికిఁగా మగువలార. 69

గీ. అనిన ముసిముసినగవుల నల్లఁబూవి
రెయిండొరుల మోములనుజూచి యొక్కరొకరు
కన్నుసైగల నేమేమొ యెన్నుకొనిరి
క్రీడియునుగూర్మి సంగడికాఁడునంత. 70

గీ. తేటరతనంపుముక్కలిపీటతెచ్చి। వింతకపురంపుఁ బొడులతోఁ బెట్టినట్టి
ముగ్గులోపలవేయంగబుసమిఁ దేఁడు।వచ్చికూర్చుండెనద్దానిపై నిపుడు

సీ. కురులు చిక్కులుతీసి క్రొత్తసంపెఁగనూనెఁ
దలయంటెఁ జిలుకలకొలికిమోర్తు
పచ్చకర్పము చాయ పసపునమేదించి
నలుగిడె నెమ్మేను నాతిమోర్తు

మంచిగంధపుఁదావి మించిగుబుల్కొన
నటకలితలనిడె నతివయోర్తు
బంగారుబిందెలఁ బన్నీరుగొనివచ్చి
జలకంబులాడించెఁ జెలువయోర్తు
నీరుమువ్రాలు తలచుట్టు నెఱయఁద్రిప్పి
తడవుమనుమని దీవించెఁ బడఁతియోర్తు
రతనములపీట దొరదిగి రాఁగనెదుట
నిలిపె బంగరు పావలు నెలఁతయోర్తు. 72

సీ. జిలుఁగుజెంద్రిక వన్నె చేలచెఱఁగునఁ
బన్నీరు ల్తడియొత్తెఁ గన్నెయొకతె
గమగమవలపులు కడలుకొనంగఁ
బూసరుల్ సిగఁజుట్టె బోటియొకతె
పెళపెళలాడు దువ్వలువపింజెలుపెట్టి
వెసఁజేతికందిచ్చె వెలఁదియొకతె
రతనాలపనిమేలి రవణంపుగుంపులు
నెమ్మినఁగీలించెఁ గొమ్మయొకతె
పొలఁతియొక్కతె జవ్వాజిపూసెమేనఁ
జెలువయొక్కతె పన్నీరుచిలికెఁబయిని
పూసురటివీచెఁ దలిరాకుబోఁడియొకతె
నిలువుటద్దమొక నెలంత నిలిపెమ్రోల. 73

గీ. ముద్దుకస్తురినామంబు దిద్దెనొసటఁ
బెండ్లి పల్లకిలో నెక్కి విడిదివెడలి
యరిగె వియ్యపువారింటి కచటమున్న
మించుబోండ్లు చిత్రాంగదఁ గొంచుఁబోయి. 74

గీ. చలువనెలఱాల జలకంపుసాలలోన। మేలిమిపసిండిపీటపై మెలఁతనునిచి
తేటపళ్ళెరమునఁ గెంపుదివ్వెపెట్టి। జవ్వనులు పాటపాడినివ్వాళియియ్య.

ఉ. పయ్యెదజాఱఁ జెక్కుఁగవపై జిఱుచెమ్మటలూరఁ బూనరుల్
కయ్యముగోర లేఁగవును గబ్బిచనుంగవ దూఱ జాఱు కొ
ప్పొయ్యన వీపుఁజేర వెసనూర్పులు పైపయిఁ గ్రమ్ముదేరఁ దా
నయ్యెడ నింతియోర్తు తలయంటఁదొడంగెను వాలుఁగంటికిన్. 76

ఉ. పాయనివేడ్కఁ దావి వెలిఁబర్వఁగ నంపఁగినూనెయంటి క
ప్పై యిరిగుంపు పెంపుగెలువంగల నిద్దపు సోగపెన్నెరుల్
పాయలుతీసిదువ్వి చెలువమ్ముగఁ జిక్కులువాపె నింతియో
ర్తాయెడ లేఁత కెంజిగురుటాకులఁగేరెడు కేలుఁదమ్ములన్. 77

గీ. పునుఁగుజవ్వాది మేదించి పెనఁచినట్టి। తావికుంకుముపౌళ్ల తోదలిరుఁబోఁడి
మేననలుగులు వెట్టెను మెలఁత యోర్తు। గబ్బిగుబ్బలఁ ద్రేఁగునఁ గానువడఁక.

గీ. సోలి సంపఁగినూనెచే సొమ్మసిలిన। పెన్నెరుల నడుతు మ్మెదపిండునకును
వెసనుసేద తేఱగ మందు వేయుకరణి। గురులకటకలియిడెలతకూనయోర్తు

గీ. పసిఁడిబిందెలఁ బన్నీరు పరుసనించి
చెలులు రతనంపుగిండ్లతో జలకమార్చ
నెఱులవెంబడి దిగజాఱు నీరుపొలిచెఁ
గ్రొమ్మెయిలు జోరునను వానగురియునట్లు. 80

చ. తలతడియొత్తె నొక్కచెలి తాఁబెడఁగుం దెలిపట్టుబట్టచేఁ
గలపము మైనలందె నొకకన్నియ కస్తురిబొట్టువెట్టెఁ దా
వెలఁదుకయోర్తు నెన్నొసట వేసలిఁ బూవులుచేర్చె నింతియో
ర్తెలమి నెలంత యొక్కరితె యింపుగఁ గాటుకతీర్చెఁ గన్నులన్. 81

గీ. విలువరతనంపుఁ దొడవులు వెట్టిమేన
జిలుఁగుబంగరు కెంబట్టు చేలఁగట్టి

చెలులుగ్గై సేయ నెలమిత్రోఁ జెలువనపుడు
పెండ్లికూఁతును జేసిరి పేరటాండ్రు. 82

వ. అంతఁ బెండ్లిచావడియందు. 83

క. లగనమిదె పెండ్లికూఁతును । నగుఁ దేనని యొజ్జబాపనయ్యలు చెలుల౯
మిగులందొందరపఱుపఁగ । ముగుదలు పరుగెత్తి రంతిపురికినినొటకన్.

చ. అడుగుల కెంపుడాల్పుడమి యత్తఱినొత్తకయుండ నెట్టనో
మడుఁగులు కాళ్ళకుంబఱుచు మాడ్కినిబర్వఁగ నిల్వుటద్దముల్
బడిబడిఁ జెల్మికత్తియలఁ బ్రక్కలనిబ్బడిఁజేయ సిగ్గుతోఁ
బడఁతుక పెండ్లితిన్నెకడ వచ్చెను నెచ్చెలిపిండుతేరఁగన్. 85

గీ. కలికినెమ్మోము తేనికిఁ గానిపించ
కుండ ముత్తైదువ తెరయొండుపట్ట
వెలసెనయ్యది నిండు రేవెల్గునకును
మిగులమాటగు మేటిక్రొమ్మొగిలుకరణి. 86

క. నలుఁగడల వాయిదమ్ములు। చెలఁగంగాఁ బేరటాండ్రు సేసలుచల్ల౯.
బలుదీవనలిడఁ బాలు। పొలుపుగఁ జని పెండ్లియరుగుపొంతకు తేఁడు౯.

క. కొమరాలినప్పుడట నే । మముతో నానేలతేఁడిమాంకన్యాం తు
భ్యమహం సంప్రదదేయని । యమరంగా దారపోసె నల్లునకెలమి౯.

క. తెఱవలటుమీఁద మెల్లన తెరనువంప
మిగులసిగ్గున ముగుదయు మొగమువంచె
మగువచెలువంబుఁగనఁ గ్రీడి మొగమునెత్తఁ
బచ్చవింటిని మరుఁడును బైకినెత్తె. 89

గీ. పడఁతిమిన్నలు తెరనల్లవంచినపుడు
కనులు మిఱుమిట్లుగొనఁ దళ్కుమనియెఁ జెలువ
బయలఁ గాఱుక్రమ్మిన గొప్పమొయిలునుండి
మించివెలువడు క్రొక్కారు మెఱుముకరణి. 90

గీ. తొయ్యలి పిసాళి చూపులన్ తూపుగముల
నోరగా నాటియుల్ల ముఱ్ఱాఁతలూఁచి
క్రీడిపయిని వ్రేల్మిడి నిండు గెలుపుగాంచి
విరువిల్తుఁడు కోయని పేర్చియార్చె. 91

చ. సరగునఁ గొమ్మ నెమ్మొగము చాయలకుంజని సేదతేఱి ని
బ్బరమగు తేనిచూపుగవ పైకొక చోటికి సాఁగఁజూచియుఁ
గురులనుచిమ్మచీఁకటిఁ దగుల్కొని యాడకె దారితప్పి బల్
మురిపెపు నవ్వువెన్నెలవెలుంగున వచ్చుచునుండుఁ గ్రమ్మఱన్. 92

ఉ. వేఱొక చోటికిం గదల వేమఱు వెల్వడి యెందుఁబోవఁగా
నేరక క్రమ్మఱన్మొగమునే వడిఁజేరెడు చూపుమొత్త ము
య్యారపుఁ జన్నుఁగొండలను నవ్వలఁ దవ్వులఁగాంచి వానిఁ బొం
గారఁగ నానవాలుగొని గంతిడి పాయక నిల్చె నచ్చటన్. 93

వ. అటుపిమ్మట. 94

చ. మురుగులుజాఱఁ జెమ్మటలు ముద్దుమొగంబునఁగాఱ ముత్యపు
న్సరు లొకయోరఁజేరఁ జిఱునవ్వులు మొల్కలుదేర నంటుఁజో
ళ్ళురుదెసలందుఁ జెక్కులపయి న్వడిఁదూఁగుచు డాలువాఱ నా
దార తలఁబ్రాలువోసె నలతొయ్యలి యాఁదలమీఁద దోయిటన్.

ఉ. కౌనసియాడ ముంగురులు గ్రక్కునఁ జెక్కులమీఁదఁగూడఁ బెం
పూనిన గుబ్బదోయి పయినొక్కట పేరులు త్రొక్కులాడఁ బై
పైని బయింటయాడ నునుబంగరుగాజులు ఘట్టువీడ నా
చానయుఁగ్రీడిమీఁదను వెసం దలఁబ్రాలనుబోసె దోయిటన్. 96

క. మదిలోపలఁ గలకూరిమి
నిదె నేఁబయిచేయియగుదు నిదె యేనగుదున్
వదలక కనుఁడనుక్రియ వా
రోడుగక తలఁబ్రాలుపోసి రొండొరులపయిన్. 97

గీ. ఒండొరుల మేనుసోఁకుట నొక్కసారి
కన్నెకును ఱేనికిని మేను గగురుపొడువఁ
దాళిఁగట్టె నాతఁడు జవరాలిమెడను
నేలవేల్పుల దీవనల్నింగిముట్ట. 98

గీ. అగ్గినెలకొల్పి మఱి వారలందులోన
నేయివ్రేల్చిరి పిమ్మట నేలఱేఁడు
పట్టి సన్నికల్ ద్రొక్కించెఁ బడఁతిచేత
నంతఁ బేలాలువ్రేల్చె నయ్యింతిమిన్న. 99

సీ. ఎలుఁగెత్తిపాడెడి యింపైనపాటలు
గండుఁగోయిలపిండు గరువమడఁప
పలుకునప్పుడుతోఁచు పల్వరుసలడాలు
నలువలంకులను వెన్నెలలనింప
పల్లెమందలిదివ్వె బటువైనమగరాల
మెడపేరులకుఁ గెంపుబెడఁగుగూర్ప
మేనిబంగరునిగ్గు మేలిమిబంగారు
పళ్ళెరంబునకును బసిమిరయొసఁగ
వారిమోములకెనరామిఁబట్టి నెలను
దిగఁదుడుపుపెట్టు కైవడి మొగములకును
జెలికిఁ జెలువుపకైదువ లలరువేడ్కఁ
గప్పురపుటారతులనిచ్చి రొప్పుమీఱ. 100

గీ. మొదటినాఁటితంతు ముగిసినపిమ్మట
బాకెనయును నాగవల్లిమఱియు
వేఱె జరగవలయు వేడుకలెల్లను
వరుసజరిగె నెల్లవారు చెలఁగ. 101

గీ. నాగవల్లియు లోనుగా నడచినంతఁ
బెండ్లినాఁడులు గడువంగఁ బేర్మితోడ
నాలుమగలను గలుపంగ నపుడుతలఁచి
మేటివేడుక నాలవనాఁటిరేయి. 102

సీ. కమ్మతావులుగ్రమ్ము కపురంపువిడెములు
పసిఁడిపళ్ళెరములఁ బొసగనుంచి
కస్తురి జవ్వాజి గందంబుఁ బన్నీరు
రతనంపుగిండుల రమణనుంచి
పటికంపుగోడల పజ్జనిర్వంకల
నిలువుటద్దంబులు నెలవుకొలిపి
పగడంపునునుఁగోళ్ళ పచ్చలపీటపై
వట్టివేళ్ళసురటి పెట్టియుంచి
వెండితబుకులఁబండ్లు వేర్వేరపెట్టి
గొప్పరతనంపుదివ్వెలు కుదురుపఱిచి
మేలిచొక్కపు బంగారుమేడలోని
వింతగదిని సింగారించి రింతులంత. 1

గీ. పడకగదిలోని రతనంపుఁ బసిఁడికోళ్ళ
దోమతెర పట్టెమంచంబుపై నెఱుంగు
టంచ దూదిపాన్పునఁ బవ్వళించియుండె
నతివరాకను మదిఁగోరియల్లఱేఁడు. 104

వ. అంతకమున్న. 105

చ. కలపమలంది నెన్నొసటఁ గస్తురిబొట్టమరించి చేరలన్
గొలువఁగజాలు కన్నుఁ గవకుందగఁగాటుకవెట్టి క్రొవ్వెదన్
వలపుగ్రమ్ము పూసరులు వావిరిఁజుట్టి పసిండిపుట్టముం
జెలువుగ గట్టి చెల్వఁగయిసేసిరి సొమ్ములువెట్టి నెచ్చెలుల్. 106

గీ. చెలులు కయిచేసి తరసింప సిగ్గుకతనఁ
బడఁతినెమ్మోము వంచి తానడువకున్న
బుద్ధులనుజెప్పి మఱిమఱి బుజ్జగించి
పూవుఁబోఁడులు బలిమిమైఁ బొదిగిపట్టి. 107

క. ననబోఁడి నొకటలాగుచుఁ
బెనిమిటికడఁ జేర్పఁదివురవింతగనాజ
వ్వని తాఁబోక పెనఁగినఁ
గనుఁగొని యొకచెల్వ యనియెఁ గన్నులనగుచున్. 108

గీ. ఇచట మాతోడఁ బెనఁగిన నెవ్వరిందుఁ
జూచిమెచ్చెదు రాతండచూచిమెచ్చు
బులుపుతీఱంగఁ బడకింటిపొంతఁ జేరి
వెనుకతీయక మగనితోఁ బెనఁగరాదె. 109

క. అనుటయు సిగ్గును జెలిపై
గినుకయుఁ జిఱునవ్వునొకట గిరికొన నపుడ
న్ననబోఁడి నట్టవై చెను
గనుదోయిం గెంపుదోఁపఁ గై విరిదండన్. 110

గీ. చెలిమికత్తెలు ముందుకు సిగ్గొకింత
వెనుకకును ద్రోయ మెల్లన వెలఁదినడిచి
పడకయిలు చేరుతఱి మొలబంటిసిగ్గు
ముంచి జాలువాఱుచుఁ దలమునుకయయ్యె. 111

క. మిక్కిలి సిగ్గునమునిఁగిన
యక్కలికింబాన్పుచేర్చి యాచెలువల్దా
మొక్కొక సాకుననడిచిన
నక్కొమ్మయు మోమువంచి యళుకుచు నిలిచెన్. 112

గీ. అంతటను గ్రీడి ముద్దియ నల్లఁ జేరి
మేనుచెమరింపఁ గెంగేలు మెల్లఁబట్టి
ముగుద విరిపాన్పుపయికి రాఁదిగిచికొనుచు
వంచుకొనియున్న నెమ్మోము పయికినెత్తి. 113

క. వలపుబయల్పడముద్దిడి
వెలఁదుకతోఁ గూడి రేయి వేడుకనుండన్
బెలుచనఁ గొక్కొరొకోయని
వెలువలఁ దగఁ గోళ్లుకూసె వేఁకువ తెలియన్. 114

గీ. తడవు రేతేనితోడను దనరియుండి
వెడలఁబోయెడుతఱిని రేవెలఁదివిప్పు
కొప్పునందుండి దిగజాఱి కూలినట్టి
విరులబంతి నాఁ దోఁతెంచె వేఁగుఁజుక్క. 115

చ. పగలొనరించుపాటిదొరవచ్చి దెసల్ వెసఁ గ్రమ్మునంచు ని
వ్వెగఁదనతేజు గోలుపడి పాఱెడు చుక్కల తేనిఁ జూచి లో
దిగులునఁ దెల్విఁ బాసిననఁ దెల్లపడెం గడురిక్కగుంపులున్
సొగసగునింటిదివ్వెలును జుక్కలతోడన తెల్విగోల్పడెన్. 116

గీ. జగముచుట్టంబు రాకఱుఁ జాలనలరి
పుడమివేల్పులు దీవించునుడువులనఁగఁ
జెవులపండువుసేయుచుఁ జెలఁగఁ జొచ్చెఁ
గరముఁ బులుఁగులరొద తెల్ల కడలయందు. 117

గీ. ఇరులవేఁటాడఁ దొలుదొల్త నేసినట్టి
చిచ్చుఅమ్మునఁ దూర్పునఁ జెలఁగెఁ గెంపు
వాలలకెల్లుఁగుల దూఱెడు నెలుఁగులట్లు
చీఁకటులు కొండబోటియలు చేరఁబాఱె. 118

గీ. తమ్మిచెలికాఁడు చీఁకట్లదఱుమువాఁడు
కలువగుంపులసూడు ఱేవెలుఁగుజోడు
గాములకు నెకిమీఁడు జక్కవలఱేఁడు
పొడుపుఁగొండను జూపట్టెఁ బ్రొద్దుపిదప. 119

గీ. అంతకంతకు వింతయొయ్యారమమర
నరమరలులేని వలపుల ననఁగిపెనఁగి
చెల్వుఁడును జెల్వయును గూర్మిచెన్నుమీఱ
హాయిగానుండిరచ్చోట నాఱునెలలు. 120

క. ఈలోపల నాతొయ్యలి
చూలాలయ్యెను మగండుఁ జుట్టములు నెదన్
హాళింబొందఁగఁ దండ్రియుఁ
జాలఁగోలమునిల్చునందు సంతసపడఁగన్. 121

చ. చనుమొనలు నల్లఁబడియెను
జనఁజన వేవిళ్లు హెచ్చెఁ జవిమంటిపయిన్
గననయ్యె నెలలునిండినఁ
గనియెనుముద్దుల కొమారుఁ గన్నియయెలమిన్. 122

గీ. పుడమివేల్పులిడిన మంచిమూర్తమందు
బభ్రువాహనుండనుచును బాగుమీఱఁ
బేరువెట్టిరి యాపసిబిడ్డకెలమిఁ
బెరుగుచుండెనతఁడు తాతయిరవునందె. 123

క. అనివైశంపాయనుఁడిటు
జనమేజయునకుఁ గరంబు సంతసమెదఁగన్
నెనయఁగ జిత్రాంగదకత
వినిపించిన వినియతండు వేడుకఁ బొదలెన్. 124

కందము. ముక్తపదగ్రస్తము.

సిరిఁబొమ్మనఁ దాల్చినదొర
దొరలేనిబలిమిఁ బగతురఁదునుము వెరవరీ
వెరవఱినవారిఁ బ్రోచెడు
గరువా, గరువంబులేని కఱకులవేల్పా. 125

తోటకవృత్తము.

పొలుపొందిన బీరముపూనిజగం
బులనెల్లను నేఁచుచు ముద్దియలా
ర్వలలిం జెఱఁబెట్టిన రావణు నా
దలలెల్లనుద్రుంచిన దండిదొరా. 126

గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన
నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందుకూరి
వంశ పయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్య
పుత్ర సుజనవిధేయ వీరేశలింగ నామధేయప్రణీతంబయిన
రసిక జనమనోరంజనం బను ప్రబంధరత్నంబు
నందుఁ సర్వంబును జతుర్థాశ్వాసము
సంపూర్ణము.